# Andhra Granthalayam

A Bilingual Quarterly Library Journal

Volume 1 March, June 1940 Number 3 & 4




*

ఆంధ్ర గ్రంథాలయం

(ఆంధ్ర, ఆంగ్ల త్రైమాసిక పత్రిక)

*

Editor
P. Rajasekharam, B. A., B. Ed., Dip. Lib.

సంపుటము ౧

మార్చి, జూన్ 1940

సంచికలు ౩, ౪

*

Andhra Desa Library Association

Office: Patamatalanka (Via) Bezwada, S. India.

# ఆంధ్ర గ్రంథాలయం

ఆంధ్ర, ఆంగ్ల భాషలందు వెలువడు సచిత్ర త్రైమాసికపత్రిక

విజ్ఞాన వ్యాపనం దేశాభివృద్ధికి మూలకందము.

ఈపనికి బాగుగ తోడ్పడునవి గ్రంథాలయములు.

ఈ గ్రంథాలయములు నామ మాత్రముగ నుండక జనసామాన్యమును జ్ఞానవంతులుగ నొనర్చుటకై చక్కని మార్గముల వెదుకక కృషిచేయునట్లు తోడ్పడు నవి గ్రంథాలయసంఘములు.

ఆంధ్ర దేశమున నీపనిని చేయునది ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము.

ఈ సంఘపక్షముననే 'ఆంధ్రగ్రంథాలయం' ప్రకటింపబడుచున్నది.

సంపాదకుడు : **పుణ్యమూర్తుల రాజశేఖరం**, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికీ, వయోజన విద్యాప్రచారానికీ అనుకూలించే వ్యాసములు, వృత్తాంతములు, గ్రంథసమీక్షలు వగైరా 'ఆంధ్రగ్రంథాలయం'లో ప్రకటింపబడును.

సమీక్షకు పంపబడు పుస్తకములు 2 ప్రతులుండవలెను.

గ్రంథాలయములకత్యంత సహాయకారి - గ్రంథప్రకటనలకు చక్కని సాధనము

సంవత్సర చందా సభ్యత్వరుసుముతో చేరి మూడురూపాయలు

---

# ఆంధ్రగ్రంథాలయం

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున వెలువడు

సచిత్ర త్రైమాసికపత్రిక





సంపుటము ౧ మార్చి, జూన్ 1940 సంచికలు ౩, ౪



సంపాదకుడు

పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

"రెండుకోట్ల డెబ్బైలక్షలమంది ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నామతము అంగీకరించేట్లయితే ఒక మాసమురోజులలో సాధ్యమవుతుంది. ముందుగా వ్యావహారిక భాషలో మీకర పత్రాల నన్నిటిని అచ్చొత్తించండి. ఆ తరువాత తెలుగు అక్షరాలూ గుణింతమూ ప్రతి వారికీ నేర్పడానికి గ్రామాని కొక ప్రచారకుణ్ణి ఏర్పాటు చేయండి. అక్షరాలూ గుణింతమూ మామూలు తెలివితేటలు గలవాడు నేర్చుకోడానికి వారము పదిరోజులకన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడయితే అక్షరాలూ గుణింతమూ వచ్చిందో ఆ క్షణమునుంచీ మీకర పత్రాలు మొదలయినవి చదువుకోగలుగుతాడు. ఇంతకన్నా దేశములో విద్య వ్యాపింపచేయడానికి సులభమార్గము లేదు. మీరీ పనికి పూనుకోవలెను. ఈ విధముగా బాల్కను రాష్ట్రాలలో యుద్ధము అయిపోయిన తర్వాత చేసినారు. నేను ఆ విషయమంతా చదివినాను. బాల్కను రాష్ట్రాలలో ఆరుమాసాలలో విద్యా శూన్యత అంతా తొలిగిపోయింది."

గి. వెం. రామమూర్తి

# విషయసూచిక (Contents)

ఆంధ్రగ్రంథాలయం

| సంపుటము ౧ | మార్చి, జూన్ 1940 | సంచికలు 3, ౪ |
|---|---|---|

# సంపాదకీయం

'God helps those who help themselves'

గ్రంథాలయసర్వస్వం' 'ఆంధ్రగ్రంథాలయం'గా మారి సంవత్సరం గడిచింది. సార్వజనిక గ్రంథాలయోద్యమవ్యాప్తియం దగ్రగణ్యులైన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు మొదటి సంచికకు సంచారగ్రంథాలయములను గురించి చక్కని వ్యాసమును వ్రాశారు. అర్ధపత్రిక వారా వ్యాసంలో గ్రంథాలయ సేవకునకు కావలసిన సంగతులు చాల ఉన్నవన్నారు. విజ్ఞానంవారు దాని నవశ్యంగా చదువవలసినదన్నారు. గ్రంథాలయ శాస్త్రమందారితేరి, ఖండాంతరముల సహితము ఖ్యాతిగాంచి, మద్రాసు విశ్వవిద్యాలయపు గ్రంథాలయమున ప్రధాన గ్రంథపాలకులుగానున్న ఎస్. ఆర్. రంగనాథన్, ఎమ్. ఏ., ఎల్. టి., ఎఫ్. ఎల్. ఏ. గారు, ఆ గ్రంథాలయముననే చిరకాలమునుండి పనిచేయుచు గొప్ప అనుభవమును సంపాదించిన కె. ఎమ్. శివరామన్, బి. ఎ., సి. సుందరం, బి. ఎ. గార్లు ప్రశంసనీయమగు వ్యాసముల నాంగ్లమందు మాపత్రికకు వ్రాస్తున్నారు. 'ఆంధ్రగ్రంథాలయం' లోని ఆంగ్లవ్యాసములు చాలగొప్పగను, ఆచరణయం దనుభవములోనికి వచ్చు పెక్కువిషయములతోను తొలకాడుచున్నవని ఇతర దేశాలవారు పొగడారు. అర్ధపత్రిక ఈవిషయాన్ని గురించి చెబుతూ "ఇంగ్లీషులో వ్రాయబడిన వ్యాసములు, గ్రంథాలయోద్యమమును గురించిన పాశ్చాత్యదేశపు పత్రికలలో ఉండు ఉన్నత వ్యాసములకు పైచేయిగానే ఉన్నవిగాని తీసిపోలేవు. ఈ పత్రికను ప్రజలు విశేషముగ ఆదరింపగోరెదము" అని వ్రాసింది. గ్రంథాలయ శాస్త్రమందు డిప్లొమాను పొందిన శ్రీ పుణ్యమూర్తి, శ్రీ పాతూరి నాగభూషణంగార్లు కాలానుగుణ్యంగానుండు వ్యాసములను వ్రాసి, గ్రంథాలయ వార్తలను ప్రోగుజేసి సహాయం చేస్తున్నారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి అధ్యక్షులైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎమ్.ఎ. గారు వయోజనవిద్యమీాద రెండు, మూడుసంచికలకు వ్యాసములు

వ్రాశారు. పత్రికాభివృద్ధి విషయంలో వారు చాల తోడ్పడుతున్నారు. బెజవాడ కాలేజీ ప్రధానాచార్యులగు డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు ఎం. ఏ., పిహెచ్.డి (లండను) గారు, తెనాలి తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీ వడ్లమూడి వెంకటరత్నంగారు మా ఆంధ్రగ్రంథాలయమునకు వచ్చే ముఖ్యమైన గ్రంథాలను విమర్శించి మాకెంతో తోడ్పడుతున్నారు. ఆంధ్రదేశమందు వివిధప్రాంతాలలో జరుగుచున్న గ్రంథసేవనుగూర్చి, వయోజనవిద్యనుగూర్చి మా పత్రికలలో ప్రకటిస్తున్నాం. ప్రముఖులీ పత్రికను ప్రశంసించారు. పెద్దలు ప్రోత్సాహకరమగు సందేశాలను పంపారు మహాసంగ్రామ జ్వాలలమధ్యనుండియు, గ్రంథాలయ శాస్త్రకోవిదులును, లండనులోని క్రోయిడను కేంద్రగ్రంథాలయపాలకులును అగు డబ్లియు. సి బర్విక్ సేయర్ గారు మాపత్రికా ప్రచురణను ప్రోత్సహిస్తూ సందేశమంపారు. దక్షిణాఫ్రికా గ్రంథాలయ సంఘంవారు తమ పత్రికను ఇప్పటికీ-యుద్ధసమయమని-విడువకుండా మా పత్రికకు బదులుగా పంపిస్తున్నారు. న్యూజిలాండు గ్రంథాలయ సంఘంవారు తమ పత్రికను పంపెదమని వ్రాశారు. ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు, జపాను మొదలుగాగల విదేశాలకు ముప్పదినాలుగు ఆంధ్ర గ్రంథాలయ ప్రతులు పంపాము. యుద్ధమంక మునిగియుండుటచే కొన్నిదేశాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటకు వీలులేకపోయింది. పంజాబు గ్రంథాలయ సంఘం వారు 'మోడరన్ లయిబ్రేరియన్' అను తమ పత్రికను, వంగదేశ గ్రంథాలయ పరిషత్తువారు తమ ప్రచురణలను పంపుతున్నారు. మద్రాసు గ్రంథాలయసంఘంవారు, వారి 'మెమోయర్సు'ను మా పత్రికకు వినిమయంగా పంపించడమే కాకుండా, వారి గ్రంథాలయములోని పుస్తకాలను తిరగేసుకొనుటకు పంపి, ఇంకా అనేకవిధాల తోడ్పడుతున్నారు.

కాని పత్రికయెడ మనవారుమాత్రం తగినంత ఆదరణ చూపుటలేదు. ఈ సందర్భంలో భారతి సంపాదకీయంలో నుడివిన ఈక్రింది మాటలు జ్ఞాపకం వస్తున్నాయి :

"పత్రికలను కొని చదవడానికి మనదేశం ఇంకా అలవాటు పడలేదు. విజ్ఞానం అంటే ఇంకాదేశీయులకు తృష్ణకలగలేదు. దేహానికి ఆహారం ఏవిధంగా అవసరమో మనస్సుకు కూడా ఆహారం అవసరమనే భావం ఇంకా మనవారికి తట్టలేదు. పాశ్చాత్యదేశాలమాట అట్లావుంచి, ఒకటి మన హిందూదేశం విషయంలోనే ఆలోచించినా ఆంధ్రేతరములైన బంగాళము, మహారాష్ట్రము, గుజరాతు మొదలైన రాష్ట్రాలలో వాఙ్మయాభివృద్ధి అమితంగా అవుతోంది. ఆరాష్ట్రాలలో తమ తమ మాతృభాషలను సర్వతోముఖంగా

అభివృద్ధి నొందించుకోడానికి బహుళ ప్రయత్నాలు జరుగుతున్నాయి. గవర్నమెంటు కార్యాలయాలలో ఉన్నతోద్యోగాలలో ఉన్నవారూ, విశ్వవిద్యాలయాలలో ఉన్నతపీఠాలను అధిష్ఠించేవారూకూడా తమకు తెలిసిన విషయాలను మాతృభాషలో వ్రాసి తమతోడి సోదరులకు విజ్ఞానం వెదజల్లుతూంటారు. మాతృభాషల కార్యాల్లో ఎక్కడలేని జవమూ బలమూ వస్తోంది. కాని మనదేశంలోని పరిస్థితులు వేరు; ప్రజలలో ఆ విజ్ఞానతృష్ణా లేదు. ఉత్సాహమూ లేదు."

దేశమందలి పరిస్థితి యిది. అష్టకష్టములుపడి వ్యాసములువ్రాసి, వ్రాయించి ముద్రాపకుల సహన, సహాయములతో కాగితమునకు కరువుగానున్న ఈయుద్ధ దినములలో పత్రికను ప్రచురిస్తోంటే, ఊరకేయిమ్మని, సగముఖరీదునకిమ్మని పీడిస్తూంటేను పత్రికాప్రచురణావసరమును గుర్తించినవారు, ధనవంతులుగూడ వ్యయమునకు వెరుస్తూంటేను పత్రికానిర్వహణ మెట్లు జరుగుతుంది? ధనాభావముచేతనే 3, 4 సంచిక లొకటిగా యిప్పుడు ప్రచురింపవలసి వచ్చింది.

దేశమందలి నిరక్షరాస్యత, జ్ఞానశూన్యత గ్రంథాలయోద్యమ వ్యాప్తికిగల అవసరం చర్విత చర్వణంగా చర్చిస్తే విసుగువస్తుందేమోఅని విడచిపెడుతున్నాము. "ప్రజలకూ గ్రంథాలయాలకు మధ్య సుహృద్భావాన్ని పెంపొందించి, గ్రంథాలయాలకు నూతనసభ్యుల నాకర్షించి వారిలో ఆశయాన్విత పఠనమును ప్రోత్సహించి, ఉత్తమగ్రంథములను ఏర్చుకొనుటయందు చదువరులకు సహాయముచేసి, చదువరికి తగిన గ్రంథమును, గ్రంథమునకు తగిన చదువరిని చేకూర్చి, పాఠకుల కుపయోగించు ఇతర గ్రంథస్థ విషయములను సూచించుటకే మా గ్రంథాలయ పత్రిక ఆశిస్తోంది." ఈ మా పత్రికను ప్రజలు, ప్రజాసంస్థలు ఆదరించి దేశసౌభాగ్యమునకు తోడ్పడుదురని నమ్ముతున్నాము.

## కీర్తిశేషులు

### సరససాహిత్యప్రశస్తకవనకళవిశిఖామణి శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

వీరు పట్టభద్రులు; ఆంధ్రగీర్వాణభాషాకోవిదులు; శ్రీరామభక్తులు. వీరు రామాయణాన్నంతా నాటకాలుగావ్రాసి ఆంధ్రవాణికి ప్రశంసనీయమగు సేవ చేశారు. పంతులుగారి శైలిలో అద్భుతమైన వ్యక్తిత్వం, సహజమైన పోకడ కనబడుతుంది. వీరి రచనలలో నాజూకైన హాస్యరసంతొలకాడుతుంది. పంతులుగారి సాక్షి నెరుగనివారుండరు. వారి రచనాకౌశలానికి 'సాక్షి'యే సాక్షి. ప్రభుసన్మా

నం, ప్రజలగౌరవంపొందిన కవులలో ఒకరు. శ్రీపిఠాపురం రాజావారు పంతులు గారువ్రాసిన నాటకాల నన్నిటిని అచ్చువేయించారు. కీర్తిశేషులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వారి 'సాక్షి' వ్యాసాలను ఆంధ్రపత్రికలో ప్రకటించేవారు. లక్ష్మీనరసింహారావు పంతులుగారి స్వస్థలం రాజమహేంద్రవరం. కాని చాలకాలమునుంచి పిఠాపురంలోనే ఉంటున్నారు. 80 ఏళ్లు వచ్చాక 1940 వ సంవత్సరం జనవరి 1 వ తేదీని స్వర్గస్థులయారు. పంతులుగారి ఆత్మకు భగవంతుడు శాంతిప్రసాదించుగాక! వారి కుటుంబానికి మా సానుభూతి.

కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, శబరవాగనుశాసనులు
శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు

తెలుగు భాషాప్రపంచంలో సామ్రాజ్యవాదంపోయి ప్రజాస్వామికం ప్రబల డానికి గత 30 సంవత్సరాలనుండీ కృషిచేసి కృతార్థులైన శ్రీ గిడుగు వేంకటరామ మూర్తిపంతులుగారి నిర్యాణం ప్రతి ఆంధ్రునికీ సంతాపహేతువు. జనసామాన్యంలో విజ్ఞానవ్యాప్తి కలుగజేయడానికి చక్కని రాజమార్గాన్ని నిర్మించి, వాగనుశాసనుల ఆజ్ఞల నుల్లఘించవలసి వస్తోందనే భయాన్నుండి తప్పించి, సామాన్యు లనుకొనే వారికిగూడ గ్రంథరచనాధికారం ప్రసాదించి, ప్రజలలో విజ్ఞానం వ్యాపింపజేయగల మనోధైర్యం కలిగించిన ఆ మహామహుని నిర్యాణానికి కంటతడిబెట్టని వారుండరు. కడపటి సందేశమిస్తూ, అభినవాంధ్రవాణిని పత్రికాధిపతుల చేతులలోబెట్టిన పంతులు గారి తుదిమాటలు జ్ఞప్తియందుంచుకొని విద్యగఱపడంలోనూ, గ్రంథాలు రచించ డంలోనూ ప్రతీ ఆంధ్రుడు స్వాభావికమైన వాడుకభాషనే ఉపయోగించి ఆవాడుక భాషామూర్తి ఆత్మకు శాంతిచేకూరుస్తారని నమ్ముతున్నాము. చంద్రునికి నూలు పోగన్న సామ్యమున మేమీ సంచికను పంతులుగారి జ్ఞాపకార్థం ప్రచురిస్తూన్నాం. పంతులుగారి కుటుంబానికి మా సానుభూతి. పంతులుగారి ఆత్మకు పరమేశ్వరుడు శాంతి ననుగ్రహించుగాక!

# కీ. శే. శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులు

శ్రీ వడ్లమూడి వేంకటరత్నము
తెనాలి తాలూకా గ్రంథాలయసంఘాధ్యక్షులు

భాషలోనయినా తమ విశిష్టత్వాన్ని నిలుపుకోదలచి పండితులు ఒక కుసందు ఏర్పరచినారు. సరిగా నడవరానిదారి అయినా అదేమంచిదని చాటినారు. ఆంధ్రులు తాము నడుస్తున్నది రాచబాట అయినా పండితులు చెప్పేత్రోవ మంచిదని విశ్వసించినారు. ఆ-కుసందున వెళ్లదలచిన ప్రతివాడు డీడిక్కీలు కొట్టుకొనేవాడే. రామమూర్తి అవతరింపవలసిన అవసరము కలిగినది.

ఇంటిపేరు గిడుగు; పండితులకు పిడుగు. ప్రజలకు రామమూర్తి. పండితంమన్యులకు భీమమూర్తి. పర్లాకిమిడి కలాశాలలో అధ్యాపకుడు. ఆంధ్రులకు మహోపాధ్యాయుడు. శిష్టులను భ్రష్టులుగా చేసిన వీరపండితులను పీటీచేసినాడు. శిష్టభాషకు శ్రీరామరక్ష. కృతకభాషకు గొడ్డటిపెట్టు. గంభీరమగు రూపము. గంభీరతరమగు స్వరము. చదువని గ్రంథములేదు. తెలియని శబ్దములేదు. చూడమఱచిన పంక్తిలేదు. చూచి మఱచిన అక్షరములేదు. చదువులకు గ్రంథాలయము. బాలకవులకు శరణాలయము. పండిత భిషక్కుల భాషాభేషజము బయటపెట్టినాడు. వ్యావహారికమునకు రక్షగట్టినాడు. వ్యావహారికముమీద బెట్టిన ఆంక్షను తీసి కృతక గ్రాంధికముమీద త్రిప్పి కొట్టినాడు. శబ్ద ప్రయోగమున సవ్యసాచి. మందుల జాబితాలు మొదలు 'మానిషాద' వఱకు పుక్కిటబట్టినాడు.

అంతులేని పాండిత్యము. అహంకారములేని విజ్ఞానము. విసుగులేని పరిశ్రమ. విస్మృతిలేని ధీపటిమ. భాషాసేవకు జీవితముగాని జీవితమునకు భాషగాదు.

నిర్మూలనమునందు శక్తియెక్కువ. నిర్మాణమునందు రక్తితక్కువ. ఐహికమున కాయాసములేదు. ఆముష్మికమున కారాటములేదు. శబరభాషకు శబ్దశాసనుడు సవరుల కక్షరములిచ్చి తానక్షరుడైనాడు.

కరుడుగట్టిన ఆంధ్రత్వము. కల్తీలేని అభిమానము. ఒడ్డెనాటిలో నుండనని తెలుగుగడ్డకు తరలివచ్చినాడు. జమీందారుతో జబర్దస్తీగా డీకొని, పర్లాకిమిడి నివాసమును పాటాకొట్టినాడు. ధనమునకు దాస్యము చేయలేదు. కీర్తికి కేలు ముడువలేదు.

వాదముతోడనే వివాదముగాని వాదితోడగాదు.

పంతులుగారు కర్మయోగి. భాషాప్రపంచమున తన కర్తవ్యమును నెఱవేర్చి కృతకృత్యుడయినాడు. శబ్దబ్రహ్మమున లీనమయినాడు.

మహోపాధ్యాయ బిరుదమునొసగి భారతీతీర్థము తీర్థస్థానమయినది. కళాప్రపూర్ణబిరుదము నర్పించి ఆంధ్రకళాపరిషత్తు తన కళాభిమానమును ప్రకటించుకొన్నది. రాయబహదూరు బిరుదముతో - కైజరు హింద్ బంగరుపతకముతో సర్కారువారు తమ గౌరవమును వెల్లడించినారు.

ఆంధ్రులు సమగ్రవ్యాకరణ నిర్మాణ దక్షుని జారవిడుచుకొన్నారు. సమగ్ర నిఘంటు రచనాచణుని ఉపయోగించుకొనలేకపోయినారు.

ఆయనకు స్మారక చిహ్నమునైన నేర్పఱచి తమ కృతజ్ఞతను వెల్లడించుకొందురా?

ఆయన ఆత్మకు పరమాత్ముడు శాశ్వతానందము నొసగునుగాక !

---

# గ్రంథాలయ నిబంధనలు

శ్రీ పాతూరి నాగభూషణం, డిప్. లిబ్.,
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి

*"If rules are needed they should surely be addressed to those who manage the library. The public chiefly need not rules, but information and guidance, suggestion and advice. Stress should he laid upon the value the library offers and how to make the fullest use of it."*

— B. M. Headicar

జనసామాన్యమందు విద్యాభిలాష, గ్రంథాలయావశ్యకతను గుర్తెరిగి తన్నిర్వహణకై అవసరమైన ధనమును ప్రేమతో నొసంగుట — ఇవి గ్రంథాలయాభివృద్ధి కెంతయు సాయపడుననుట నిస్సంశయము. దీని కనుగుణముగ అభివృద్ధి కాటపట్టులుగనున్న అమెరికా, బ్రిటను మున్నగు పాశ్చాత్యదేశములందు గ్రంథాలయచట్టములేర్పడి అచ్చటి గ్రంథాలయముల అభివృద్ధికి చాల సహాయకారులుగనున్నవి. ఈ చట్టములు గ్రంథాలయస్థాపనకు పోషణకు నెంతదోహదములుగ నున్నవో, ఆ యా దేశముల గ్రంథాలయోద్యమచరిత్రల పఠించిన తెలియగలదు.

కాని గ్రంథాలయములు స్థాపింపబడినపిమ్మట నవి తమధర్మమును సరిగ నిర్వహించవలెనన్న మరి కొన్ని యంశములును ముఖ్యములయియున్నవి. ఇందుకు చదువరులకు రుచించు వివిధవిషయములను గూర్చిన ముఖ్యగ్రంథములు, వానిని భద్రపరచుటకు యోగ్యములైన భవనములు, ప్రతిచదువరికి తగినపుస్తకమును ప్రతిపుస్తకమునకు తగినచదువరిని జాగ్రత్తగ సమకూర్చుచు, అందరికి తన గ్రంథాలయమెట్లుపకరించునో యోచించి, అందు కనువగుపద్ధతుల నెప్పటికప్పు డాచరణలోనికి దెచ్చుటకై నిరంతరము ప్రయత్నించు గ్రంథాలయపాలకులు మిగుల అవసరములు. వీనికితోడు గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడునవి సక్రమములగు గ్రంథాలయనిబంధనలు. కఠినములు, అనవసరములు నగు నిబంధన లెంతగా గ్రంథాలయాభివృద్ధికి ఆటంకములుగనున్నవో నేటి మనదేశమందలి చాల గ్రంథాలయముల పరిస్థితులు ఋజువు చేయగలవు. చందాదారులకు తప్ప పుస్తకము లింటికివ్వబడవను నొక్క చిన్న నిబంధన మన గ్రంథాలయములలోని పుస్తకముల నెట్లుపయోగమునకు రాకుండ

---

* 12-5-38 వ తేది వామనగుంటపాలెములో జరిగిన ఏడవ తెనాలి తాలూకా గ్రంథాలయ మహాసభయందీవ్యాసము చదువబడినది.

చేయుచున్నదో, వానినెట్లు బీరువాలలోనుండి బయటకు తీయవలసిన అవసరముగాని, శ్రమగాని లేకుండ గావించుచున్నదో గ్రంథాలయ సేవకులందరికి దెలిసినవిషయమే. కాన గ్రంథాలయ నిబంధనల విషయమయి వాని సాధక బాధకములగురించి గ్రంథాలయ నిర్వాహకులు తెలిసికొనవలసినదియు, అనుసరించదగినదియు విషయము కొంతగలదు.

## నిబంధనలు – నిర్మాణచట్టము

నిబంధనలను పదము గ్రంథాలయముపట్ల ఇష్టమువచ్చినట్లు వాడబడుచున్నది. ఆంగ్లమున 'రూల్సు' అను దానికి పర్యాయపదమిది. కాని గ్రంథాలయ సంస్థా నిర్మాణ చట్టములనే కొందరు నిబంధనలని వాడుటయేగాక అసలు గ్రంథాలయ నిబంధనలనే నిర్మాణచట్టములలో నిరికించుటయు జరుగుచున్నది. నిర్మాణచట్టము ఆంగ్లమున 'కాన్‌స్టిట్యూషన్' అని పిలువబడుచున్నది. దీని ప్రయోజనము వేరు. నిబంధనల యుద్దేశము వేరు.

నిర్మాణచట్టము లేక 'కాన్‌స్టిట్యూషన్' గ్రంథాలయోద్దేశముల నిర్వచించి అవి కార్యరూపమును దాల్చుటకేలాటి ప్రయత్నములు సలుపవలయునో, ఎవరికి లోబడి గ్రంథాలయము నడువవలెనో, పాలకవర్గమువారి అధికారమెట్టిదో అందలి వివిధోద్యోగుల విధులెట్టివో తెలియజేయను.* నిబంధనలు లేక 'రూల్సు' గ్రంథాలయము తెరచియుండుకాలము, గ్రంథాలయ ప్రవేశము, ఇండ్లకు పుస్తకము లిచ్చుట మొదలుగాగల గ్రంథాలయ నిత్యవిధులనుగూర్చి వివరించును. నిర్మాణ చట్టము గ్రంథాలయ నిర్వహణమును సూచించుచో, నిబంధనలు గ్రంథాలయోపయోగమునకు దారితీయును.

## నిబంధనల అవసరము

గ్రంథాలయ నిబంధనలనుగూర్చి ప్రస్తావించుటలో ముందునేను నేర్చిన, నాకు నచ్చినయొక శాస్త్రాంశమునుద్ఘాటింతును. అదేదన-'The less the rules the more the service' అనుసూత్రము. దీనియర్థము నిబంధనలెంత తక్కువగనున్న గ్రంథాలయోపయోగమంత విస్తరించునని. నిబంధనలు తక్కువగనుండుటయే గాక సులువుగ కూడనున్న నట్టి గ్రంథాలయము తనయాదర్శమునకు మఱియు సమీపమున నుండునని వేరే చెప్పనక్కరలేదు. దీనినిబట్టి అసలునిబంధనలే నిమిత్తము లేదని చెప్పినను

* గ్రంథాలయ మాదిరి నిర్మాణచట్టమునకై ఆంధ్రగ్రంథాలయం 2 వ సంచికలో 96-100 పేజీలలో చూడనగును.

చెప్పవచ్చును. (నిబంధన లనునవి చదువరులను పుస్తకములవైపుకు నాకర్షించునట్లు చేసి, గ్రంథాల యోపయోగమును విస్తరింపజేయు నిమిత్త మేర్పడినందున కొందరీ పదమునకుబదులు 'సలహాలు' లేక 'సూచనలు' అని వాడుట బాగుండునని యెంచుచున్నారు). కానిఆచరణలో నిట్టిస్థితికి మనమువచ్చుటకు మానవస్వభావ మెంతయు నాటంకముగ గన్పట్టుచున్నది. ప్రపంచములోని ప్రతి గ్రంథాలయమువారును తమ ఆదర్శమును పూర్తిగ గ్రహించి దానిని నూటికి నూరుపాళ్లు అమలు జరుపుచు, పౌరులుకూడ తమహక్కులనిమిత్తము పోట్లాడుటకు మాత్రమేగాక తమవిధుల నయితముపూర్తిగ నెరిగి వానికి విధేయులై నడచినతప్ప యీపరిస్థితిని మనము చేరజాలము. కాన సక్రమనిర్వహణకై ఏవేని కొన్ని నియమములకు లోబడి గ్రంథాలయ పాలన జరుగవలసిన అవసరము కొంతకన్పట్టుచున్నది. అయిన నీనియమము లేర్పడవలసినవిధము, ఇది నిర్వహింపబడవలసిన పద్ధతినిగూర్చి కొంచెము విచారింతము. ఇంతలకు గ్రంథాలయ ప్రధానసూత్రముల ముందు పరిశీలింతము.

## గ్రంథాలయ సూత్రములు

'పుస్తకము లుపయోగము నిమిత్తమేర్పడినవి' అనునది గ్రంథాలయ ప్రథమ సూత్రము. గ్రంథాలయమందున్న యే పొత్తముగాని నిరుపయోగముగ పడియుండరాదు. అందలి 'ప్రతిపుస్తకమునకు తగిన చదువరిని - ప్రతిచదువరికి తగిన పుస్తకమును' సమకూర్చవలసిన బాధ్యత భాండాగారిపైగలదు. దీని కాటంకములుగ నుండక గ్రంథాలయములోని పుస్తకముల నెక్కుడుపయోగకరములుగ జేయుట కనువుగ నిబంధన లేర్పడవలసియుండును. అట్లుగాక గ్రంథాలయములోని పొత్తముల భద్రతకు భంగముకలుగు నను తలంపుతో వానిని బయటికి రానీక నిరోధములు గల్పించు గ్రంథాలయ నిబంధనలు - నిర్బంధనలగునేగాని అవసరమైన కట్టుబాట్లు, ప్రయోజనకరమైన పద్ధతులు కాజాలవు.

కాలముయొక్క విలువను బాగుగ గ్రహించిన పాశ్చాత్యులు గ్రంథాలయ శాస్త్ర విషయమున సహితము కడుశ్రద్ధతో, కాలము వృథాగాకుండవలెనను సంకల్పముతో అందునుగూర్చి ముఖ్యసూత్రము నొకదానిని నిర్వచించి గ్రంథాలయలోకమునకు ప్రసాదించియున్నారు. 'చదువరులయొక్కయు, గ్రంథాలయ సిబ్బందియొక్కయు కాలమును వృథాగానీయక' కాపాడవలసిన ధర్మమును వారు సిద్ధాంతీకరించి గ్రంథాలయాభివృద్ధికి సుకరమైన పద్ధతుల సూచించియున్నారు. మఱియు 'నొక ప్రాణివలె గ్రంథాలయముకూడా పెరుగుదలయే స్వభావముగా గలిగియున్నద'ని చెప్పుటద్వారా ఆదర్శగ్రంథాలయ స్వరూపమును నిర్వచించియున్నారు. అట్టి స్వభావము లేనినాడు రోజురోజు చకచక పెరిగిపోవుచున్న విజ్ఞానరాశి నొక కొంతయైన చవిజూడనిచ్చగించు

పాఠకలోకమునకు నిత్యాభివృద్ధిలేని గ్రంథాలయము, నిజోపయోగముద్వారా తగిన యుత్సాహము కల్పించని కారణమున, నిరుపయోగమైపోవును. ఇందువలన అసలు గ్రంథాలయాదర్శమునకే భంగముగలిగి మనముదాని నే యుద్దేశముతో నారంభింతుమో దానికి ముప్పువాటిల్లును.

## నిబంధనలెట్లుండవలెను ?

ఈసూత్రముల దృష్టిపథమున నుంచుకొని మనమేర్పఱచు నిబంధనలే సరియైనవిగ నెంచదగియున్నవి. కాక గ్రంథాలయ ధర్మమునుమరచి సంకుచితాదర్శముతో మనము చేయునియమము లెప్పుడును సరిగనుండవు. అందుచే గ్రంథాలయ పాలకులైనవారు గ్రంథాలయాదర్శమును పూర్తిగ గ్రహించి దాని బొందు నిమిత్తమవసరమైన నిబంధనల మాత్రమే చేయుట సరియైనపని. ప్రచండమైన సైనిక శాసనమునుబోలు నిబంధనలు గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడవు కాన వానిని ప్రోత్సహించుటకూడదు. నిబంధనల నేర్పాటుచేయుటలో గ్రంథాలయ నిర్వాహకులు ఈవిషయమును ముఖ్యముగ గమనించవలెను. మఱియు మొదట సూచించినవిధమున నిబంధన లతిగానుండక కావలసినంతవరకే యుండుటయు, అతికఠినముగానుండక ఆదర్శనిర్వహణమునకు అనుకూలమైనంత సులభముగ నుండుటయు, లక్ష్యరహితముగ నుండక ఆలోచనాపూర్వకమైన ఉద్దేశ జనితములగుటయు చాలఅవసరము. ఇవి నిషిద్ధవిషయముల సూచించు జాబితాలుగగాక చదువరులకు ప్రోత్సాహము గల్పించు వాక్యములుగ నుండుట మంచిది. గ్రంథాలయ దైనందినజీవితమున అవసరమైన ఈనిబంధనలు నిర్మాణచట్టమున నిరికింపబడక దేశ, కాల, పాత్రముల ననుసరించి అప్పటికప్పుడు వలయువానిని గ్రంథాలయ పాలకులే నిర్ణయించుట, మార్చుట, చేర్చుట మంచిది. ఇందువిషయమై గ్రంథభాండాగారి కెక్కువ స్వతంత్ర ముండుటయు అవసరము. లేకున్న నొక యంత్రమువలె పనిచేయవలసినస్థితి యాతనికి సంభవించుటయు, నందువలన చదువరుల కసంతృప్తి జనించి తద్వారా గ్రంథముల ఉపయోగము సన్నగిల్లుటయు జరుగును. భాండాగారిస్వతంత్రుడైన - చదువరుల యభిరుచులను, శక్తియుక్తులను జాగ్రత్తగ పరిశీలించువాడుగాన తానేర్పఱచు నియమములద్వారా గ్రంథాలయధర్మమును పూర్ణముగ నెరవేర్చగలడు.

## నిబంధనలు–చదువరులు

గ్రంథాలయ పాలకులు నిబంధనల నేర్పాటుచేయు విషయమున గమనించవలసిన విధులను సూక్ష్మముగ తెలిసికొన్నపిదప వీనిపట్ల చదువరుల హృదయమెట్లుండునో ఒకింతపరికించి వారివిధులను సహితము కొంత విస్తరించు టవసరము.

1. ఇండ్లకు తీసికొనిపోవునట్టి గ్రంథములసంఖ్య విషయమై చదువరుల యభిప్రాయములను మున్ముందు పరిశీలింతము. ప్రతి గ్రంథాలయమునందును సర్వసాధారణముగ ఇన్ని పొత్తములకంటె మించి ఇండ్లకియ్యబడవను నిబంధనను మనము తీసికొందము. ఈ సంఖ్యయొక్క అవసరమును సరిగా గ్రహించని కారణమున చాలమంది దీని కభ్యంతరము తెలుపుదురు. అయితే యీ నిబంధన వ్యక్తుల కిబ్బంది గలిగించు నిమిత్తముగాక అందరికి ననుకూలముగ నుండుటకే యేర్పడినదను సంగతిని చదువరులు గమనించునట్లు చూడవలెను. ఒక్కని యింటిలోనున్న గ్రంథాలయ పుస్తకము తక్కినవారి కందఱికి ఉపయోగపడుటలేదను నిబ్బందిని తగ్గించుటకే ఈ నిబంధన అవసరమైనది. ఉపయోగములేక ఒకరియింటనున్న పొత్తము అనవసరముగ తన ప్రయోజనమును గోల్పోవు చున్నదనుసంగతి నెరిగినప్పుడు ఎవరుగాని యీ నిబంధనను నిరసించజాలరు. అప్పుడు గ్రంథాలయ పాఠకు లెదురాడక దీనిని విధిగా గౌరవింతురు.

2. ఇండ్లకు తీసికొనిపోయిన పొత్తములను తిరిగి గ్రంథాలయమునకు చేర్చవలసిన కాలపరిమితిని గూర్చిన నిబంధన పైదానికంటె నెక్కుడు చిక్కుగా నెంచబడుచున్నది. నియమితకాల మతిక్రమించిన పిమ్మట గ్రంథాలయమునకు వచ్చు పుస్తకములపై విధింపబడు జరిమానా చదువరులకు చాల బాధకరముగ నుండును. తాము గ్రంథాలయమునుండి తెచ్చుకొను పుస్తకమును తిరిగి యివ్వవలసిన గడువును నిత్యము స్మరించవలసిన దేనాయని కొందరు ప్రశ్నింతురు. మఱికొందరు జరిమానాను చెల్లించియైనను పుస్తకములను నియమితకాలమునకు మించిన దినములు తమకడనే యుంచుకొందురు. ఇందువిషయమై చదువరులు తమతోడి పాఠకులపట్ల ప్రవర్తింపవలసిన విధమును గమనించునట్లు చేయుటకై గ్రంథాలయ పాలకులు పూనుకొనవలెను. సామ్యపద్ధతుల వారికి తమతోడి చదువరుల కష్టనిష్ఠురముల తెలియజేయుటవలన వారు దారికివచ్చి ఈనిబంధన నతిక్రమించక పాలింతురు.

3. గ్రంథాలయము లందలి పుస్తకములలో కొన్ని తఱచుగ నుపయోగింపవలసినవిగ నుండును. అపురూప గ్రంథములు, లావుపాటి బరువైన పుస్తకములు, చిత్రములతోకూడిన పుస్తకములును కొన్నియుండును. ఇట్టివి సర్వసాధారణముగ నిండ్ల కివ్వబడవు. నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వములు మొదలుగాగల కొన్ని గ్రంథములు, వరుసగ సాంతము చదువుట కనుకూలించవు. ఇవియు నిండ్లకీయబడవు. పై పుస్తకములలో కొన్నింట ననేకవిధములగు విజ్ఞానముండి అది బహుజనమునకు తరచు అవసరమై యుండుటయు పొసగును. ఇట్టి గ్రంథములు గ్రంథాలయమునుండి తొలగించి బయటికి తీసికొనిపోయిన గ్రంథాలయములో వాని నుపయోగించదలచు

వారందఱికిని ఇబ్బంది కలుగుటయేగాక రోజులో చాలకాలము పాటవి వ్యర్థముగ పాఠకుల యిండ్లకడ పడియుండుటయు సంభవించును. కాన ఎక్కువజనుల ఉపయోగార్థమేర్పడిన యీ నిబంధన సైత మవశ్యాచరణీయమను సంగతిని చదువరులు గమనించుచునట్లు చేయవచ్చును.

4. పత్రికలు విజ్ఞానవిషయముల నెప్పటికప్పుడు తెలియజేయుచు చదువరుల మనముల కానందము గొల్పుచుండును. క్రొత్తపత్రికలను పై పుస్తకములవలెనే ఇండ్లకు తీసికొనిపోరాదను నిబంధనయు పైదానివలెనే తప్పక అనుసరించదగియున్నది. ప్రత్యేకవిషయములపై వ్రాయబడు వ్యాసములతో నిండియున్న సంచికలను ఎవరుగాని చదువరని సాకు చెప్పుటకంటె ఇతరులును తనవంటివారే యనుకొని తన సౌకర్యమునిమిత్త మితరుల నిబ్బంది పరచకుండునట్లు ప్రతిపాఠకుడు ప్రోత్సహింపబడవలెను.

## కొన్ని ముఖ్యాంశములు

పనుగుర సౌకర్యము నిమిత్త మొకవ్యక్తి సాంఘికవిషయము లన్నిటిలో వలెనే గ్రంథాలయ నిబంధనలపట్లకూడ కొంతత్యాగము చూపు టవసరమని తెలిసికొంటిమి. ఇక గ్రంథాలయ నిబంధనలలోని ముఖ్య విషయములను గూర్చి విచారింతము.

ఆధునిక గ్రంథాలయములలో దేని నిబంధనల పఠించినను లేక గ్రంథాలయశాస్త్రగ్రంథములం దెచ్చటనైన నున్న మాదిరి గ్రంథాలయ నిబంధనల గాంచినను మున్ముందు మనకు గన్పట్టునంశము 'గ్రంథాలయము తెరచియుండుకాలము' నకు సంబంధించినదై యుండును. ఈకాలము విషయమై పాటించవలసిన సిద్ధాంతము అంతునిమిత్తమైన ఆచరణ విషయములో మన గ్రంథాలయములేవియు సరిగ నడచుకొనుటలేదు. మన గ్రంథాలయములు తెరువబడు సమయములు చదువరుల కనుకూలముగ నుండుటకు బదులు గ్రంథాలయముల నడపువారి ఇచ్ఛ ననుసరించి యేర్పడుచున్నవి. సర్వసాధారణముగ పగలంతయు పొలముపనులలో మునిగియుండు రైతుకూలీజనమున కాలవాలమగు పల్లెటూళ్లలోని గ్రంథాలయములు రాత్రులందుగాక పగటివేళలో కొంతకాలము మాత్రమే తెరచియుంచబడు విషయమింద రెఱిగినదే.

గ్రంథాలయములో ప్రవేశించి యందలి విజ్ఞానసామగ్రిని స్వేచ్ఛతో నుపయోగించుటకై ఆదర్శ నిబంధన లందరి నాహ్వానించును. కాని మనస్స్థిమితము లేనట్టియు, అపరిశుభ్ర దేహులయినట్టియు, మర్యాదకరమగు దుస్తుల ధరించనట్టియు

వారల కే గ్రంథాలయ నిబంధనలుగాని ప్రవేశము నొసంగ నిరాకరించును. గ్రంథాలయములో ప్రవేశించు ప్రతి చదువరియు, ప్రేక్షకుడును మున్ముందు గ్రంథాలయ నిబంధనల నంగీకరించిన విషయమును సూచించుచు ప్రవేశద్వారమువద్ద నుంచబడు 'ఆగమనసూచిక'లో సంతకము చేయవలసియుండును. ఎవరుగాని తమతో కుక్క మొదలగు జంతువులనుగాని, చంటిపిల్లలనుగాని గ్రంథాలయములోనికి తీసికొని పోరాదు. గ్రంథాలయములో నున్నంతకాలము పెద్దగా మాట్లాడుటకుగాని, పొగ త్రాగుట ఉమ్మివేయుట మొదలుగాగల పనుల నొనరించుటకుగాని, అమర్యాదగ మాట్లాడుటకుగాని అవకాశములుండవు సరిగదా — గ్రంథాలయమును వీడిపోవు నప్పుడు ప్రతివారును తామెట్లు లోపల ప్రవేశించెదరో అట్లనే బయటికి పోవలెను. పుస్తకముల సహితము గ్రంథభాండాగారి యనుమతిలేనిదే ఎవరును బయటకు తీసికొనిపోవుటకు వీలుండదు.

చందాదారులకుతప్ప పుస్తకము లిండ్లకివ్వబడవను నిబంధన సర్వసాధారణముగ గ్రామగ్రంథాలయములకును, కొంత మొత్తమును ధరావతుగ నుంచినవారు మాత్రమే పుస్తకముల నిండ్లకు తీసికొని పోవచ్చునను నిబంధన పట్టణ గ్రంథాలయములకును మామూలుగ నున్నవి వీనివలన దారిద్ర్యమునకు, దారిద్ర్యమును మించిన విజ్ఞానలోపమునకు నివాసమైన మనదేశమున గ్రంథాలయసంస్థలు నిష్ప్రయోజనములగుచున్నవి. ధనవంతులకు చదువునం దాసక్తిలేకపోవుట, చదువు కొనవలెననెడి కుతూహలము గలవారలకు ధనములేకపోవుట చాల చిక్కుగ పరిణమించుచున్నది. కాన చదువరుల నడవడుల గమనించి, గ్రంథముల భద్రత కవసరమైన జాగ్రత్తను తీసికొనుచు గ్రంథాలయమందలి పొత్తములెంత యుపయోగపడుట కవకాశములుండునో అంత కనుకూలములయిన నిబంధనల నమలు జరుపుటుత్తమము. సాధారణముగ అంటుజాడ్యములుగల రోగులకుగాని, అట్టి రోగులున్న ఇండ్లకుగాని పుస్తకము లివ్వబడకపోయినను, సదుద్దేశముతోకూడిన పఠనాభిలాష గల ప్రతి యొక్కరికీ వారివారి శక్తిసామర్థ్యముల ననుసరించి వలయు గ్రంథముల నిండ్లకొసంగుట ధర్మము.

ఈసందర్భమున నొక విషయమును ముఖ్యముగ గమనించవలెను. చదువరుల విధుల వివరించుటలో ప్రతియొక్కరును గ్రంథాలయమునుండి తీసికొను పుస్తకముల కనీససంఖ్య, వానిని తిరిగి గ్రంథాలయమునకు చేర్చవలసిన కాలనిర్ణయము విషయములో గ్రంథాలయ నిబంధనలను ఎదురాడక వారు పాటించవలెనని చెప్పుకొంటిమి. ఈవిషయమున గ్రంథాలయ పాలకులును తమబుద్ధిని వినియోగించి అవసరమని తోచి నప్పుడును, ఇతరుల కిబ్బంది లేనప్పుడును చదువరులకుకొన్ని ప్రత్యేక సౌకర్యములు కల్పించ వలసియుండును. అట్టి యవసరములను జాగ్రత్తగ గమనించి గ్రంథా

లయ నిర్వాహకులు తమ ధర్మము నేమరక పాలించుచుండవలెను. ఒక్కొక్కరి కియ్యదగిన వానికంటె నెక్కువ గ్రంథముల నిచ్చుటకును, అట్లీయబడిన పుస్తకములు తిరిగి గ్రంథాలయమునకు చేర్చదగిన కాలనిర్ణయమును పొడిగించుటకును నిర్వాహకుల కవకాశమున్న, వారును తమ విచక్షణ నుపయోగించి చదువరుల కోర్కెల దీర్చుచుండగలరు. గ్రంథాలయ ప్రయోజనము సిద్ధించుటకై నిర్వాహకు లొక్కొక్కప్పుడు నిబంధనల మీరవలసి వచ్చుటయు తటస్థించును. ఇట్టి సందర్భములకు పాలకులెదురు చూడగలిగిననాడే గ్రంథాలయము తన ఆదర్శమును పూర్ణముగ నెరవేర్చగలుగును.

## నిబంధనలలో భేదములు

గ్రంథాలయములు పలురకములు. జనసామాన్యమున కంతటికీ సాధారణముగ నుపయోగించు పౌరగ్రంథాలయములు గాక, వేరువేరు సంస్థలకును, ప్రత్యేక పరిస్థితులలోనుండు వ్యక్తులకును సంబంధించిన ప్రత్యేక గ్రంథాలయములును ప్రపంచమున చాలగలవు. యూనివర్సిటీ, కాలేజీ, స్కూల్ లైబ్రరీలు - స్త్రీ, బాల భాండాగారములు- న్యాయశాస్త్ర, వాణిజ్య పుస్తకాలయములు - బోటు, బందీ, వైద్యాలయ గ్రంథాలయములు - అంధుల గ్రంథాలయములు ప్రత్యేక గ్రంథాలయములుగ పేర్కొనబడుచున్నవి. వీని యన్నిటికి నొకేవిధమగు నిబంధన లుపయోగించవు. స్థానికపరిస్థితుల ననుసరించి పౌరగ్రంథాలయముల నిబంధనలును, సంస్థల ఆదర్శములను బట్టి ప్రత్యేక గ్రంథాలయములనిబంధనలును మారవలసియుండును. అయినను మొత్తముపై ప్రపంచమందలి ఏభాండాగార నిబంధనలైనను గ్రంథాలయ సూత్రములకు కట్టుబడియే నడువవలసియుండును.

## మాదిరి గ్రంథాలయ నిబంధనలు

## శ్రీ శారదా గ్రంథాలయము, లక్ష్మీపురము

### నిబంధనలు

**పనిచేయుకాలము :**

1. ఈ గ్రంథాలయము ప్రతిదినము ఉదయము 8 గంటలనుండి సాయంత్రము 6 గంటలవరకు తెరచియుంచబడును.

**ప్రేక్షకులు :**

2. గ్రంథాలయము తెరచియుండు సమయమున నిందలి గ్రంథములను పత్రికలను సర్వజనులు ఉచితముగ చదువుకొనవచ్చును.
3. గ్రంథాలయములోను, దాని యావరణయందును ప్రేక్షకులు నిశ్శబ్దముగ నుండవలెను. పొగ త్రాగుట, ఉమ్మివేయుట చేయరాదు.

4. గ్రంథాలయమునకు వచ్చు ప్రేక్షకులు ప్రవేశద్వారముకడ ఇందు నిమిత్తము ప్రత్యేకముంచబడు 'ఆగమన సూచిక'లో చేవ్రాలు చేయవలెను.
   చంటిబిడ్డలను పెంపుడు జంతువులను గ్రంథాలయములోపలికి తీసికొని రాగూడదు.
5. ప్రేక్షకులు గ్రంథాలయములోని పుస్తకములను, పత్రికలను జాగ్రత్తగ చదువుకొని తాము బయటికి పోవునప్పుడు వానిని గ్రంథభాండాగారి కప్పగించవలెను.
6. గ్రంథాలయమందు తా ముపయోగించిన పుస్తకములకు పత్రికలకు ఏలాటి నష్టము కలిగినను చదువరులు దానికి బాధ్యులై యుందురు.
7. గ్రంథభాండాగారి అనుమతిలేక పుస్తకములు వగైరా గ్రంథాలయ పరికరములు వేనిని గాని ప్రేక్షకులు గ్రంథాలయమునుండి బయటకు తీసికొనిపోగూడదు.
8. గ్రంథాలయమునకు చేర్చదగిన పుస్తకములనుగురించియు, గ్రంథాలయ నిర్వహణమండలి లోపములను గూర్చియు సూచింపనెంచు ప్రేక్షకులు తమ అభిప్రాయములను 'చదువరుల సలహాల పుస్తకము'లో వ్రాయవలెను.

## గ్రంథముల అరువు :

9. గ్రామమునందలి చదువనేర్చిన స్త్రీ పురుషు లెల్లరును గ్రంథాలయ పాఠకులుగాచేరి ఇందలి గ్రంథముల నుచితముగ నరువుతీసికొనవచ్చును.
10. గ్రంథాలయ చందాదారులు కానివారును, 18 సం॥ లకు లోబడిన వయస్సువారును నియమిత నమూనాలో దరఖాస్తుచేసి పాలకవర్గమువారి అనుమతిని బొందిననే గ్రంథాలయ పాఠకులుగ నెంచబడుదురు.
11. ఒక్కొక్క పాఠకునికి తడవకు 2 గ్రంథములవరకు అరువీయబడును. వీనిని వాపసిచ్చి మరల క్రొత్తగ్రంథములను వారుతీసికొనవచ్చును.
12. పాఠకులు తాము గ్రంథాలయమునుండి అరువు తీసికొన్న గ్రంథములను 10 దినములలోపల వాపసు చేయవలెను. ఒకసారి తీసికొన్న గ్రంథములే మరల కావలసియున్న గడువులోపల వాపసుచేసి అప్పటికి మరెవ్వరుగాని వానినడిగియుండని పక్షమున తిరిగి తీసికొనవచ్చును.
13. భాండాగారి కోరినచో గడువుతో నిమిత్తములేకనే పాఠకులు తమ వద్దనున్న గ్రంథములను వాపసు చేయవలెను.
14. పాఠకులు తాము చదువుట పూర్తికాగానే గ్రంథములను గ్రంథాలయమునకు వాపసు చేయవలెనుగాని ఎట్టి పరిస్థితులలోనైనను ఇతరుల కరువీయరాదు.
15. పాఠకులు గ్రంథాలయ పుస్తకములలో వ్రాయుట, గీతలు గీయుట మున్నగు పనులచేయరాదు. తాము తీసికొన్న గ్రంథముల కేలాటినష్టము గలిగినను పాలకవర్గము వారు నిర్ణయించు పరిహారమును పాఠకులీయవలసియుందురు.
16. పరిశోధనాదికములకు ప్రత్యేకింపబడిన గ్రంథములు, అచ్చులోలేని పుస్తకములు, జీర్ణావస్థయందుండుటచేగాని అత్యంతభారముగలవి యగుటచేగాని భద్రముగ నుపయోగించవీలుగాని పొత్తములు, వ్రాత ప్రతులు మున్నగువానిని పాఠకులు గ్రంథాలయావరణమునందే చదువుకొనవలెను.
17. ప్రత్యేకవసతులు కావలసినవారు పాలకవర్గమువారికి నివేదించుకొనవలెను. పరిశోధకుల కవసరమైన వసతులను గ్రంథాలయ పాలకులు కల్పింతురు.

# గ్రంథాలయ పత్రిక

శ్రీ పుణ్యమూర్తి, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

*'In enterprises of every kind, believe me, it is better to lose the game by a card too much than one too little; for it sounds better to be called rash and daring than timorous and cowardly.'* (—CERVANTES.

## ఆ శ యం

ప్రజలకూ గ్రంథాలయాలకు మధ్య సుహృద్భావాన్ని పెంపొందించుట, నూతన సభ్యుల నాకర్షించి వారిలో ఆశయాన్వితపఠనమును ప్రోత్సహించుట, ఉత్తమగ్రంథములను ఏర్చుకొనుటయందు చదువరులకు సహాయముజేసి, చదువరికి తగిన గ్రంథమును గ్రంథమునకు తగిన చదువరిని చేకూర్చుట, పాఠకుల కుపయోగించు ఇతర గ్రంథస్థవిషయములను సూచించుట, ఆదర్శ గ్రంథాలయ పత్రికకు ఆశయములుగా నుండాలి.

గ్రంథాలయోద్యమ వార్తలను ప్రచురించి, ఒక గ్రంథాలయం మరొక గ్రంథాలయాన్నిగురించి ఒక గ్రంథాలయసంఘం మరొక గ్రంథాలయసంఘాన్ని గురించి తెలిసికొని, గుణముల గ్రహించి అనుకరించుటకును, దోషముల పరిత్యజించి తమ యుద్యమ మందట్టి లోపములున్న దిద్దికొనుటకును గ్రంథాలయ పత్రిక సహాయపడాలి. గ్రంథాలయ సేవ సుకరంగా జరగాలంటే వేరువేరు గ్రంథాలయములందు అనుభవముచే తెలిసికొనిన విషయములు ప్రకటించి ఉపయుక్తమగు గ్రంథసేవా సమస్యలను చర్చించి గ్రంథాలయ శాస్త్రాభివృద్ధికి తోడ్పడాలి. దేశమందు వేరువేరు స్థలములందు నెలకొల్పబడిన గ్రంథాలయాలకు వీటినన్నిటిని పోషించవలసిన బాధ్యతగల ప్రభుత్వసంస్థలకు ఈపత్రిక నమ్మదగిన మధ్యవర్తిత్వం వహించాలి. సాధ్యమైనంతవరకు ప్రతి గ్రంథాలయముయొక్క వ్యక్త్యవసరములను గుర్తించి మొత్తంమీద గ్రంథాలయాల కుపయోగించే విషయాలను సూత్రప్రాయంగా సూచించాలి. అట్టి సూత్రము లుపయోగకరమైన రూపమునుదాల్చ వలెనంటే ఈపత్రిక చర్చారంగంకావాలి.

గ్రంథాలయ పత్రిక నేది గ్రంథాలయశాస్త్రాన్నిగురించి వ్రాయడానికి, గ్రంథాలయోద్యమ చరిత్రను చిత్రించడానికి, గ్రంథాలయోద్యమ వ్యాపకులపేరు ప్రచారం చేయడానికిమాత్రమే ఉపయోగించుకోవాలని ఉద్దేశపడడం చాలపొరబాటు. గ్రంథాలయ పత్రిక గ్రంథాలయ సేవకులకేగాక గ్రంథపాఠకులకును ముఖ్యమును

సంగతిగ్రహించాలి. గ్రంథాలయము నుపయోగించు ప్రతివ్యక్తియు గ్రంథాలయ పత్రిక తాను కలిగియుండుట అవసరమని గుర్తించునట్లు పత్రికను నడపాలి.

గ్రంథాలయ పత్రికలో నుండదగిన విషయాలను మూడు భాగాలుగా చేయవచ్చు i వ్యాసాలు ii గ్రంథసమీక్షలు iii గ్రంథాలయవార్తలు.

## వ్యాసాలు

'లోకోభిన్నరుచిః' పాఠకలోకాన్నంతను తృప్తిపరచాలంటే పత్రికలోని వ్యాసాలు పలువిధములగు విషయములగూర్చి ఉండాలి. గ్రంథాలయ సేవకులు నవీనమార్గముల నవలంబించి చదువరులకు సౌకర్యముల నేర్పాటుచేయాలంటే గ్రంథాలయ శాస్త్రసంబంధమైనవి, విదేశాలలోని గ్రంథసేవా పద్ధతుల నెఱుకపరచునవి వ్యాసాలుండాలి. ప్రజలు కాలానుగుణ్యంగా నడచుకొనుటకుగాను ఎప్పటికేది ప్రస్తుతమో ఆవిషయములం దభిరుచి కలుగజేయుటకు అనేకవిషయములగూర్చి అనుభవజ్ఞులచే వ్యాసములు వ్రాయించవలసి యుంటుంది. నేడు యూరోపుదేశమందు మహాసంగ్రామము జరుగుచున్నదంటే ఆవిషయమందు చదువరుల కభిరుచికలిగించు వ్యాసమును వ్రాయించి తత్సంబంధమైన సవ్యాఖ్యాన గ్రంథసూచికను తయారుజేయించి ప్రకటించాలి. చైనాను జపాను కబళిస్తున్నదంటే, ఏగ్రంథాలుచదివితే చైనా జపానుల ప్రస్తుత పోరాటాన్ని అవగాహన చేసికొనగలమో గ్రంథాలయ పత్రిక సూచించాలి. క్రొత్త క్రొత్త ఉద్యమాలు పొడసూపినపుడు నిరుద్యోగుల దృష్టి నావైపునకు త్రిప్పి వారికావిషయమం దభిరుచికలిగించి ఆయా ఉద్యమములకు సంబంధించిన వాఙ్మయ సూచికను ప్రకటించాలి. ఫొటోగ్రాఫీ, తోటలనుపెంచుట, తేనెపట్టు పరిశ్రమ, పశుచికిత్స, గృహవైద్యము మొదలగు అభిరుచుల (Hobbies) గూర్చి అనుభవజ్ఞులచే ఆకర్షణీయముగా గ్రంథపఠనకు దారితీయునట్లు వ్రాయించవచ్చును. ప్రశ్నలకు, సందేహాలకు జవాబులుగ చిన్న చిన్న వ్యాసాలు ప్రకటింపవచ్చు. జలాంతర్గాములనుగూర్చి కాని, బ్రిటిషు నౌకాదళమునుగూర్చికాని, పోలుల ప్రభుత్వ పద్ధతినిగూర్చిగాని, నానాజాతి సమితినిగూర్చిగాని, నోబిలు బహుమానమును గూర్చికాని ఎవ్వరైన ప్రశ్నించిన వాటినిగూర్చి సంక్షిప్తముగు వ్యాసమును, ఆవిషయములగూర్చి తెలిసికొనుటకు తగిన గ్రంథసూచికను ప్రకటింపవచ్చును. ఒక పరిశ్రమలోగాని, ఒకఉద్యమంలోగాని అభిరుచి కలిగించేటందుకు తత్సంబంధమగు గాథలు త్రవ్వి చెప్పవచ్చును. విషయమును సమగ్రముగ తెలిసికొనుటకు తగిన గ్రంథములను సూచించుట ముఖ్యమని మరువరాదు. మొత్తం మీద 'గ్రంథ పఠనమూలమున జ్ఞానము నభివృద్ధి చేసికోగలను చేసికొనవలెను, అను ఇచ్ఛ జనింపజేయుటే ఈ వ్యాసముల ముఖ్యోద్దేశమై ఉండాలి.

## గ్రంథ సూచికలు

గ్రంథసూచికలు ప్రచురించి నంతమాత్రమున పత్రిక ఆశయం నెరవేరదు. ఏ విషయంమీద సూచిక తయారుచేయబడిందో ఆవిషయాన్ని ఆకర్షణీయంగా, ఆహ్లాదకరంగా చేసి ఇదివరలో ఆవిషయాన్నిగూర్చి తెలియనివారికావిషయమం దభిరుచి కలుగజేసేటట్లు విపులంగా చర్చించాలి. అట్లు చేయకపోతే ఆవిషయమం దభిరుచి కలవారలకు మాత్రం ఉపయోగించునుగాని, క్రొత్తచదువరు లాకర్షింప బడరు. కనుక వ్యాసాలలో కొన్ని దేశ కాల పాత్రల ననుసరించి గ్రంథస్థమయిన ముఖ్యవిషయములను గూర్చి, కొన్ని ఉత్తమ గ్రంథములను గూర్చి విపులంగా వ్రాయాలి.

## గ్రంథ సమీక్షలు

దీర్ఘమైన గ్రంథసూచికను తయారుజేసి క్లుప్తంగా పేలవమైన విమర్శనొసగుట కంటె, కొలది గ్రంథాలను మాత్రమేర్చి సమగ్రమైన విమర్శనొసగినచో గ్రంథాలయాలకు చదువరులకుగూడ ఉపయోగంగా ఉంటుంది. ఈ సందర్భంలో 'ప్రతిభ' నాదర్శంగా తీసికొనవచ్చు. ప్రచారార్హమయ్యు, తగిన ప్రోత్సాహాన్ని పొందనటువంటి గ్రంథాలను, తదితర ఉత్తమ గ్రంథములను మాత్రమే విమర్శించాలి. చక్కగా అమ్ముడుపోతూ ఉన్న పుస్తకాలను విమర్శించు టనవసరం. వ్యాఖ్యానమంటే ఆవేశజనితమగు కచ్చితమైన గుణదోష వివరణగాని మూగవర్ణనగాదు. ఏదేని ప్రత్యేక విషయంమీద కొలది గ్రంథములనేర్చి ఒకదానితో నొకటి పోల్చి విశదీకరించవచ్చును. సరిగా ప్రచారంలోనికి రాని గ్రంథముల నాకర్షణీయంగా చేయాలంటే, ఆ గ్రంథంలోని భావోద్రేక పూరితములైన భాగములనుగాని, ముచ్చట గొల్పే ఉపాఖ్యానాలను గాని ఉదాహరించాలి. క్లుప్తంగా కవిజీవితాన్ని వ్రాస్తే వ్రాయవచ్చును; కవి ఛాయాపటమునుగూడ ప్రచురించుట మందిదే.

## శైలి

వ్యాసాలలోని శైలి 'నన్ను ముట్టుకోకు నా మాలకాకి' అనునట్లుండరాదు. పాండిత్య ప్రదర్శనాశయం వదలుకోవాలి. సహజ ధోరణిని చిత్రించాలి. సాధ్యమైనంతవరకు శాస్త్రసాంకేతిక శైలి వదలి, సామాన్య చదువరులకు సులభగ్రాహ్యమగునట్లు వ్రాయాలి. వెలవెల పోతూను, జిగిబిగిగాను, పక్షపాతంగాను, బానిస భావంతోను, తిరస్కారంగాను, పుల్లవిరుపుగాను ఉండగూడదు. విషయానికి తగినట్టు మనోరంజకంగా, రసవంతంగా ఉండాలి; భావోద్రేకపూరితమైన శక్తితో తొలకాడాలి.

## కూర్పు

పావురపు గూళ్లపద్ధతిని విషయముల సమర్చడం తల నొప్పిపుట్టిస్తుంది. నియమిత పుటలందు ఉపసంఘ సభ్యులపేర్లు, గ్రంథాలయ సేవకుల నామములు, నిబంధనావళులు చర్విత చర్వణంగా ప్రకటిస్తే గ్రంథాలయ పత్రికకు సినీమా ప్రచార ప్రకటనలకు తేడా ఏమీఉండదు. ఉద్దేశరహితమగు దీర్ఘమైన గ్రంథసూచికలు గ్రంథాలయ పత్రిక రూపమున కేమీ ఆధిక్యత కల్పింపవుగాని, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, కేంద్ర గ్రంథాలయాలు, సర్వజనోపయోగమగు ఇతర గ్రంథాలయాలు నూతనముగ తెప్పించు గ్రంథముల పట్టీలను ప్రచురించి నందువల్ల ఉపయోగము లేకపోలేదు. వాటికొక స్థానము నియమించిన నియమించవచ్చును.

## ప్రకటనలు

ప్రచార ప్రకటనలు లేకపోతే గ్రంథాలయ పత్రిక కొకవిధమైన లావణ్యమబ్బుతుందని చెప్పాలి. పత్రికను పోషించే చందాదారులు లేని రోజులలో ధర్మంగాను, సగము ధరలకు పత్రిక నియ్యమని పీడింపబడే పరమ నిర్భాగ్యదశయందు ప్రచార ప్రకటనల మూలమున వచ్చు ఆదాయమునేపత్రికా తిరస్కరింపలేదేమో అనుకుంటాను! అందుచేత ఒక పనిజేస్తే బాగుంటుంది. పత్రికయందు వేరు వేరు స్థలములలోగాని, అట్టమీదగాని తావొసంగకున్నచో పత్రిక రూప మంతగాచెడదు.

## బొమ్మలు

మధ్య మధ్య విషయమున కనువైన చిత్రములుంటే కంటికింపుగాను, మనస్సునకానందముగాను ఉంటుంది. వ్యాసకర్తలయొక్క ఉపన్యాసకులయొక్క ఛాయా పటములు, భావ ప్రకటితములగు పటములు పత్రికకొక విధమైన కళను తీసుకు వస్తాయి. స్పష్టముగాలేని చౌకరకపు పటములుండుట కంటే లేకపోవడమే మంచిది. సంబంధములేని చిత్రములను ప్రకటించుట వృథాప్రయాస. ఇట్టి చిత్రపటములుండడం లేనిపోని ఆడంబరం, దర్జా తప్పితే అంత అవసరం మాత్రంగాదు.

శీర్షికలలో శీలం, సభ్యత, సరసం, ఆకర్షణ ఉండాలి. ప్రతిసంచికా నూతన నూతన విషయాలతో నిండి నవీనంగా కనబడాలి.

## బాహ్య రూపం

తాత్కాలిక విలువమాత్రం కలిగిన పత్రికల కంత వెలగల కాగిత ముపయోగించడ మనవసరం. కలకాలముండదగిన పత్రికలకు మేలైన కాగితమే ఉపయోగించాలి. మంచి చెడ్డలకు కిమ్మతే పరిమాణంగా తీసికొని తలనొప్పి కలిగించు

రంగులవి, నేత్రములను నొప్పి జేయు గ్లేజువి ఉపయోగించకుండా ఉంటే బాగుం టుంది. అట్టరంగు ప్రతి సంచికకు మార్చడ మనవసరం. మార్పే ప్రధానంగా మారిస్తే ఆ మార్పుకు విలువఉండదు. సంపుట సంఖ్య మారినప్పుడు మారిస్తే చదువరుల దృష్టి నాకర్షిస్తుంది.

## వెలువడుటకు వ్యవధి

ప్రతిక త్రయిమాసికముగా వెలువడితే జనసమ్మతముగా నుండుట కష్టము. పత్రికా ప్రచురణ ప్రజల ఆదరణకు దూరమవుతుంది. మాసపత్రికగానో కనీసం ద్వైమాసికముగనో ప్రకటించుట ఉచితం. ముప్పదిపుటలుగల త్రయిమాసికము కంటె పది పుటలుగల మాసపత్రిక ప్రశంసనీయమగు సేవజేస్తుంది.

## మూల్యం

మాసపత్రిక ప్రతికి నాలుగణాలుకంటె ఎక్కువ కాకుండ వెల నిర్ణయించినచో అభిమానము, అవసరము ఉన్న ప్రతివ్యక్తి పత్రికను కొంటాడు; ఎక్కువ పత్రికలు ఖర్చూ అవుతాయి. సంవత్సర చందా మూడురూపాయలకు మించరాదు. పత్రిక ఆశయం నెరవేరవలె నంటె ప్రజ లెక్కువగా చందాదారులుగ చేరాలి. చందా దారుల సంఖ్య ఎక్కువకావలెనంటె పత్రికను చౌకగా అమ్మవలె. మూలధనం కోసం కొలది లాభం చూచుకొన్నా కేవలం లాభసాటి వ్యాపారంకొఱకు ప్రయ త్నంచేయడం కూడదు. ప్రచురణ ఖర్చులు మనసులో నుంచుకొంటే అయినవారికి కానివారికి పంచిపెట్టలేమని గ్రహించవలసి ఉంటుంది. అయినను కొంతమంది ముఖ్యులకు చందా లేకుండా ఇవ్వడం అవసరం.

'కంట్రీ లయిబ్రరీ మాన్యూల్' నుండి సంగ్రహించిన పశ్చిమ దేశాలలో గ్రామ గ్రంథాలయ పత్రికకయే ఖర్చుల వివరం ఇక్కడ చూపెదను. మనదేశమునకా వివరము లెంతవరకు వర్తించునో విచారించు బాధ్యత పత్రికా ప్రచురణ కర్తలకు వదలెదను.

> "గ్రామ గ్రంథాలయ పత్రిక. ద్వైమాసికము. 20-24 పుటలు. క్రౌను ఆక్టేవో సైజు. సాంవత్సరిక చందా 1 షిల్లింగు చొప్పున 400 చందా దారులు. ప్రతి ఒక్కటికి 2 పెన్నీలు వెల. 750 ప్రతులు ముద్రితం. అందు 250 ప్రతులు చందా లేకుండా ఇస్తారు. ఒక్కొక్క సంచిక ప్రచురణ కొరకు 10 పౌండ్లు ఖర్చు. మొత్తంమీద సంవత్సరానికి 66 పౌండ్లు. కవరు పేజీలు మూడింటిమీదను అచ్చొత్తించు ప్రచార ప్రకటనల మూల

మున వచ్చు ఆదాయం సంవత్సరానికి 16 పౌండ్లు. అనగా సంచికకు 2 పౌ 13 షి. 6 పెన్నీలు లోటు. కాని పత్రికా ప్రచురణవల్ల ప్రజలకు కలిగే లాభంతో పోల్చిచూస్తే ఈలోటు చాల తక్కువట. 1000 మంది చందా దారులుంటే పత్రిక స్వయంపోషకంగా ఉంటుందని అంచనా వేయబడింది. "

## ప్రచారం

కేంద్ర స్థానములందు పత్రికను ప్రదర్శించాలి. గ్రంథాలయ సేవలో అగ్రగణ్యులగువారికి, వార్తాపత్రికలకు అభిప్రాయంకోసం పంపాలి పురపాలక సంఘ సభ్యులకు, స్థానిక సంస్థలలోని సభ్యులకు, శాసనసభా సభ్యులకు అప్పుడప్పుడు పంపాలి. సాంఘిక సంస్థలకు, పాఠశాలలకుకూడ పంపుట మంచిది. ప్రచార ప్రకటనలు సంపాదించుకొనే టందుకుగాను గ్రంథ ప్రచురణ సంస్థలకు పంపు టవసరము. పత్రికకు దోహదమిస్తారని తోచు వ్యక్తులకు సంస్థలకు విజ్ఞప్తులు పంపాలి.

## ఆశీర్వచనం

'ఆంధ్రగ్రంథాలయం' ఆవర్శప్రాయంగా వడిదుడుకులు లేకుండా నడిచి, దేశంలో చందదారుల సంఖ్య నభివృద్ధిచేసి, గ్రంథాలయముల నత్యంతోపయోగములగు సంస్థలుగాజేసి, గ్రంథాలయ సౌకర్యాలు, గ్రంథాలయోద్యమమునెడ ప్రభుత్వ సానుభూతి సుకరములగునట్లు నడచునని నమ్ముచున్నాను. దైవము తోడ్పడుగాక !

---

# అమెరికాదేశ సౌభాగ్య సౌధనిర్మాత
# మెల్విల్ డ్యూయీ

శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరం, బి.ఏ., బి.ఇడి., డిప్. లిబ్.

కొన్ని జీవితాలలో సారమేఉండదు. కొన్ని జాతీయంగా మాత్రం చరిత్రాత్మక మవుతాయి. డాక్టరు మెల్విల్ డ్యూయీ లాగ యావత్ప్రపంచంలో జాతి మత వివక్షతలేకుండా, తరతరాలకి దశాంశసంఖ్యాపద్ధతి ఈ ప్రపంచమం దున్నంతకాలం ఉద్రేకం ఊరించి, ఉత్సాహం పురికొల్పి, మానవజీవితాని కాదర్శంగా ఉండే జీవి తాలు మచ్చుకు మాత్రం ఉంటాయి.

## వంశముద్రల నతిక్రమించిన అసాధారణవ్యక్తి

ఆడ్యూయీ మహాశయుడు 1851 డిశంబరు నెల 10 వ తేదీని జన్మించాడు. ఆయన తలిదండ్రులు సామాన్య కుటుంబీకులు. కాని డ్యూయీ తన వంశముద్రల నతిక్రమించాడు; పరిసరాలకు దాసుడుగాలేదు; బాల్యాన్నుండి కూడా ఊహా ప్రపంచంలో మానవ సౌభాగ్యం కోసం సౌధాలు నిర్మించడానికి సాహసించాడు; సేవాదర్శ సంప్రాప్తికి కావలసిన మార్గాలన్నీ చక్కగా నిర్మించుకొన్నాడు. జీవితంలో ఒక్క నిమిషమైనా వృథాపుచ్చలేదు. తండ్రిగారి తోళ్లషాపులో పనిచేస్తోనే ఉండే వాడు—లెక్కలు గుణించడం, సారస్వతం చదవడం, సంఘసేవను గూర్చి ఆలో చించడం మానేవాడుకాడు !

## విశేషమైనప్రజ్ఞ – అఖండమైన పూనిక

ఆయన మేధాశక్తి అద్భుతమైనది. అనుకున్నపని పూర్తిచేయడంలో అమోఘ మైన మనోనిశ్చయం, పూనికాను. ఆయన జ్ఞానతృష్ణ అపారం; ఆయన ఒక విజ్ఞాన సర్వస్వం అని చెప్పాలి. నేర్చుకొన్న విషయాల నమలునందు పెట్టడంలో అద్వితీయుడు. అసాధారణమైన వాగ్ధోరణి పట్టుదలతో సంపాదించాడు.

## గొప్ప సేవానిరతుడు

గ్రంథాలయోద్యమాని కాయన చేసినసేవ అపారం. గ్రంథాలయాలలో గ్రంథ పాలకుడుగాను, గ్రంథాలయ కళాశాలయందు అధ్యాపకుడుగాను, గ్రంథాలయ సంఘాలకు కార్యదర్శిగాను ఉండి గ్రంథాలయశాస్త్రాభివృద్ధికి, గ్రంథాలయోద్య మాభివృద్ధికి, విద్యావిస్తరణకు ఆయనచేసిన సేవ చాల ప్రశంసనీయమైనది. గ్రంథా లయ నిర్మాణమునకు గాను కొన్ని చట్టములను తయారుచేశాడు. అమెరికాదేశ మందలి గ్రంథాలయోద్యమాభివృద్ధికి ఈ చట్టములే కారణం. అమెరికాదేశ

మందీ మహాశయుడు ఎన్నెన్నో గ్రంథాలయ సంస్థల నేర్పాటు చేశాడు. ఆడంబరంగా పదవుల నాక్రమించి ఊరుకోలేదు. స్వానుభవముచే తెలిసికొని, గ్రంథాలయ నిర్వహణమునకు కావలసిన అనేక గ్రంథరాజములను వ్రాశాడు. ఆ గ్రంథము లన్నియు గ్రంథాలయ ప్రపంచాని కంతకు మార్గ దర్శకములై విలసిల్లుతున్నాయి. పూర్తిగ దోషరహితము గాకున్నను, సులభ గ్రాహ్యమై, పెక్కు గ్రంథాలయము లచే నుపయోగింపబడుచున్న దశాంశ వర్గీకరణపద్ధతికి ఈయనే కర్త. ఈపుస్తకం సుమారు అరువది రూపాయలు ఖరీదు.

## అంతర్జాతీయ దృక్పథం

డ్యూయీ మహాశయుని దృక్పథ మెప్పుడును అంతర్జాతీయమేగాని, జాతీయపు టిరుకుసందులలోనే సంచరించునది కాదు! సలహాలకొరకు ఆయనవద్దకు దేశ దేశాల నుండి పోయేవారు. భారతభూమినుండి సహితం అనేకు లాయనవద్దకు వెళ్లి అనేక విషయాలను నేర్చుకొనేవారు. ఒకప్పుడు కీర్తిశేషులైన జె. ఎస్. కుడాల్కరు ఎం. ఏ, ఎల్. ఎల్. బి. గారు అమెరికాకు పోయి వారిని దర్శించినప్పుడు, బరోడా మహారాజుగారు గ్రంథాలయోద్యమమునకు చేయుచున్న పరిశ్రమను విని నంతనే ఆయనగారెంతయో సంతసించి, ఆనంద బాష్పముల రాల్చి రాజుగారి నాశీర్వదించారట !

## చూచి తీరాలి !

డ్యూయీ దినచర్య పుస్తకం చూస్తే ఆయనపడిన కష్టపరంపరలు, తెలిసికొనిన అసంఖ్యాకములగు విషయములు, ఆయన అసాధారణమైన అనుభవం, పట్టుదల, సంస్కరణలు తీసికొని రావడంలో ఆయనకు గల గుండె నిబ్బరం, ఆయన అద్భుత మైన భాషాప్రావీణ్యం దిగ్భ్రమ గొల్పుతాయి!

### ఆ లోకోపకారి దివంగతులైన దిటీవలనే – 1931 లో

డాక్టరు మెల్విల్ డ్యూయీని గూర్చి సంక్షిప్తముగా తెలిసికోవాలంటే
1. గ్రంథాలయసర్వస్వం సంపుటం 1 సంచిక 2 లో 166 వ పుటచూడండి.
2. శ్రీ ఎస్.. ఆర్ రంగనాథన్, ఎమ్. ఏ., ఎల్. టి, ఎఫ్. ఎల్. ఏ గారి *Prolegomena to library classification* లో 185-187 పేజీలలోగూడ మెల్విల్ డ్యూయీ జీవితం చక్కగా చిత్రింపబడింది.

సమగ్రంగా ఆయన జీవితాన్ని చదవాలంటే-

*Melvil Dewey Seer-Inspirer-Doer* అనే పుస్తకంచాలు.

# జర్మనీదేశము : ఛాత్ర గ్రంథాలయములు

## స్థాపనావశ్యకత

ఐరోపా మహాసంగ్రామానంతరము జర్మనీదేశము నందలి కొన్ని విశ్వవిద్యాలయములలో పాఠశాలలకు సంబంధించిన పబ్లిక్ లైబ్రరీ లనబడు ఛాత్ర (విద్యార్థి) గ్రంథాలయములు స్థాపింపబడెను. అచ్చటి విద్యార్థుల మానసికావసరముల కనుగుణ్యముగ నివి బయలుదేరెను. విశ్వవిద్యాలయ గ్రంథాలయములును, తదితర విద్యాసంస్థల గ్రంథాలయములును కేవలము పాండిత్య ప్రకర్షగల గ్రంథములతో నిండియుండును. ప్రతి విద్యార్థియు తన పాఠ్యక్రమమునకు సంబంధించిన శిక్షణముతో పాటు ఇతరమగు సాధారణ జ్ఞానమునుకూడ పొంద నభిలషించును. ఇది వారికి లభించుటయు ముఖ్యము.

ఈ అవసరమును జర్మనీలోని కేంద్ర గ్రంథాలయములును, అచ్చటి పాఠశాలా గ్రంథాలయములును తీర్చజాలకున్నవి. ఆధునిక కాలపు తత్త్వమును దెలుపు గ్రంథజాలము వీనియందు లేకుండుట, సాధారణ జ్ఞానమునుగూర్చి తెలుపు పొత్తముల నడుగువారు పెక్కురుగనుండి, అందు బహు కొలదిమందికి మాత్రమవి అందుబాటులో నుండుట దీనికి కారణములు. ఈ లోపములు దీర్చుటకై అచ్చటి ఛాత్ర గ్రంథాలయములు ప్రయత్నించు చుండును.

## పుస్తకములు

ఈ గ్రంథాలయములలో అత్యంత పాండితీ ప్రకర్షగల గ్రంథము లుండవు. విద్యార్థులు తమ చదువుకు సంబంధించిన విషయముల నిచ్చట జదువుకొనుట కివి యేర్పడలేదు. హోమర్, వర్జిల్, హారేస్, డేంటీ, షేక్స్పియర్, గెటీ మున్నగు పూర్వకవులతో పాటు నేటి ప్రముఖ కవీశ్వరుల గ్రంథములనుకూడ వారిచ్చట పఠించుట కేర్పాటులు గలవు. వివిధవిషయములలో ప్రసిద్ధికెక్కిన మానవోత్తముల జీవితచరిత్రములు, వ్యాసములు, వృత్తాంతములు, యాత్రల గూర్చిన బహువిధగ్రంథములను వారీ గ్రంథాలయములందు చదువుకొనవచ్చును. పురాణ గాథలు, చారిత్రక కథలు, ఆచారవ్యవహారములు, అన్ని కాలములకు సంబంధించిన సకల దేశ సమాచారములను గూర్చి వ్రాయబడిన పొత్తములు, ప్రపంచమును గూర్చిన పరిజ్ఞానమును వృద్ధిబొందించు అన్ని విధముల వ్రాతలేగాక, ప్రత్యేక

* అమెరికన్ లైబ్రరీ అసోసియేషన్ వారి 'పాప్యులర్ లైబ్రరీస్ ఆఫ్ ద వరల్డ్' అను గ్రంథమునుండి తర్జుమా చేయబడినది.

విషయములందు పండితులు కానివారలకు సహితము సులభగ్రాహ్యమై అభిరుచిని కల్పించదగు పుస్తకములు—విజ్ఞాన విషయకమైన వివిధ క్షేత్రములకు సంబంధించినవి ఇందు కానవగును. మఱియు రాజకీయము, మతము, వేదాంతము, బోధనా విధానము మున్నగు విషయములపై ప్రకటితమగు అధునాతన కరపత్రములచేతను, వివిధ దృక్పథములకు సంబంధించిన ముఖ్యములగు పత్రికారాజముల చేతను ఈ గ్రంథాలయములు నిండియుండును.

## నిర్వహణము

ఇవి స్థాపింపబడిన కారణము ననుసరించి వీని పరిమాణము వేగముతోను, కట్టుబాట్లు లేకను వృద్ధియగుటకు మాత్రమే యత్నింపరు. ప్రాతగిలి పనికిమాలిన పుస్తకములు త్రోసివేయ బడుచున్నను శాశ్వతోపయోగమున కనుకూలించు వాఙ్మయ మెక్కువగనే మిగులుచుండును.

జర్మనీ యందలి ఛాత్ర గ్రంథాలయముల నుండి పుస్తకము లింటికీయబడవు. వీనియందు పుస్తకముల సమర్చుటకు ప్రత్యేకపు ఏర్పాటులుగాని, పుస్తకోపయోగ నిర్వహణమున కొక నియమిత పద్ధతిగాని, పాఠకులు గ్రంథముల నరువు తీసికొనుట కవసరమైన పత్రముల విధానముగాని లేక పుస్తకములు, కరపత్రములు, పత్రికలు మొత్తముగ గదులలో నుంచబడి అచ్చటనే వానిని చదువుకొనుటకును, చూచుకొనుటకును అవకాశములు సమకూర్పబడినవి. ఇట్లుంచుట యొక్క ఉద్దేశము చదువరు లిందుండు నప్పుడు మానసికముగ తమ స్వంత ప్రపంచమున నున్నట్లెంచుకొనవలె ననియే. ఇందుకుగాను మామూలు గ్రంథాలయముల పద్ధతినిగాక అత్యంతానుకూలమైన పరిసరములతో నివి యొప్పారునట్లు శ్రద్ధగైకొనబడును. ఈ గ్రంథాలయము లందుండు బీరువాలు, కుర్చీలు, చిత్రపటములు మున్నగు పరికరములు వీనికి మామూలు గృహముల యందుండు వాతావరణమును ప్రసాదించుచుండును.

గ్రంథ సంగ్రహణ విషయమై సహాయపడుటకు వీని చదువరులు ప్రోత్సహింపబడుదురు. ఈ గ్రంథాలయములయందు 'సలహాలు' లేక 'అవసరముల' పాత్ర మొకటి యుంచబడి చదువరులు తమ అవసరముల నిందు వ్రాయునట్లు నిర్వాహకులు తరచు శ్రద్ధ వహింతురు.

ఈ ఛాత్ర గ్రంథాలయోద్దేశము మున్ముందు జర్మనీ దేశమున పొడసూపకున్నను ఇచ్చట దీనికొక విశిష్టమగు రూపము సంప్రాప్తమయ్యెను. జర్మనీలోని మొదటి ఛాత్ర గ్రంథాలయము 1917 వ సం॥ లో 'బాన్' పట్టణమందును, రెండవది 1927 వ సం॥ లో 'బ్రెస్లా' పురమునను వీనిలో కడపటిది 1929 వ

సం॥ లో 'ఫ్రాంక్ ఫోర్టు' నగరమునను ప్రారంభింపబడెను. విశ్వ విద్యాలయము లకు సమీపమందున్న వ్యక్తులయొక్క-గాని ప్రభుత్వముయొక్క-గాని భవనములందలి అనుకూలములగు గదులయందు వీని నుంచుటకు వసతులేర్పాటు చేయబడెను. ఇటీవల జర్మనీలోని విశ్వ విద్యాలయములున్న నగరములలో నెలకొల్పబడిన విద్యార్థి గృహములందు వీనినుంచి యున్నచో బాగుండెడిది. కాని ఈ విద్యార్థి గృహములు స్థాపించినప్పుడు వీనియందు గ్రంథాలయముల నుంచుటను గూర్చిన ఆలోచనకు తగిన ప్రాముఖ్యత కలుగలేదు.

ఈ ఛాత్ర గ్రంథాలయముల స్థాపనకును పోషణకును అవసరమైన ధనమును కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రీయ ప్రభుత్వములు, నగర నిర్వాహక సంఘములు మున్నగు ప్రభుత్వమునకు సంబంధించిన సంస్థలు గాని విశ్వ విద్యాలయ హితకారిణీ సమాజములు గాని కొంతభాగమును, వీని యుపయోగముల బొందు విద్యార్థులు కొంతభాగమును భరించు చుందురు. ఆయా గ్రంథాలయములకు సంబంధించిన విద్యార్థులు తాము తమ గ్రంథాలయముల నుపయోగించినను ఉపయోగించ కున్నను ఒక్కొక్కరు తడవకు అరమార్కు-నుండి ఒక మార్కు- (షిల్లింగుకు కొంచెము తక్కువ)కు మించని కొలదిపాటి మొత్తమును విధిగ చెల్లించవలెను.

పైన వివరించిన విద్యార్థి గ్రంథాలయములు స్థాపింపబడిన చోట్లనెల్ల వీనికి మంచి ప్రోత్సాహము లభించెను. ఒకానొక ప్రదేశమున నిట్టి గ్రంథాలయము స్థాపింపబడినప్పుడు బహిరంగముగ కొందరు విద్యార్థులచే పంపబడిన లేఖలోని క్రింది యంశము లీవిషయమును ఋజువు చేయగలవు.

> "చిన్ని విద్యార్థులముగ పుస్తక విక్రయశాలల గవాక్షములకడ నిల్చొని అందలి ఆకర్షవంతములగు క్రొత్తపుస్తకములను మేమెన్ని పర్యాయములో చూచియుంటిమి. అందన్నిటిని గాకున్నను కొన్నింటినైన మేము ప్రేమతో చేతులందుంచు కొని చూచుకొనుట కెంతో అభిలషించి యుందుము. కాని లోనికేగి వానిని చూచుటకై అనుమతిని బడయవలెనన్న మిక్కుటమగు సిగ్గును, గర్వమును మా కడ్డువచ్చెడివి. ఒకవేళ వీనిని గెలిచి మేమట్టి అవకాశమును పొందగలిగినను వానిని తిరుగవేయుటకు మాకు తగినంత సమయ ముండెడిదిగాదు. ఇప్పుడన్ననో కొలది వారముల క్రితము 'బాన్' పట్టణమున విద్యార్థులకు ఆధునిక గ్రంథముల నందజేయుటకై యొక గ్రంథాలయము నెలకొల్పబడినది. కాంతి మంతములగు నీ గ్రంథాలయపు గదులలో చిన్న చిన్న మేజాబల్లలు, సోఫాలు, కుర్చీలు, మధ్య మధ్య పుస్తకముల బీరువాలు అమర్చబడియున్నవి. ఈ గదులలో ఏమూలనైన

కూర్చొని మిత్రులతో ప్రసంగించుటకును, ఏ విషయమును గూర్చియైన వారితో ప్రస్తావించుటకును అనుకూలించు చక్కని వసతులున్నవి. ఈ గ్రంథాలయము నుపయోగించుకొనుటకు పాఠకుల పత్రముపై చేవ్రాలు చేయనక్కరలేదు. ఏ యుద్యోగి యనుమతిని గాని పొందవలసిన పనిలేదు. ఎవరుగాని తమ కవసరమైన దాని నిచ్చట వెంటనే బడయవచ్చును. శాస్త్రములు, కళలు, ఆర్థిక రాజకీయములకు సంబంధించిన పుస్తకములే గాక సారస్వత మంమును చక్కని గ్రంథములు అత్యంతాధునికమైనవి ఇచ్చట లభించును. వీనిలో కడపట సూచించిన సారస్వత గ్రంథములు బహుళ వ్యాప్తియందుండి వలసినప్పుడు విద్యార్థులకు లభించుట కష్టముగ నుండును. ఈ ఛాత్ర గ్రంథాలయములలో నేలాటి పరిశీలనయు నుండదు. ఇందలి గ్రంథజాలమంతయు చదువరుల సమక్షమున నుండుటంబట్టి ప్రతి యొక్కరు వాని విలువను స్వయముగ నిర్ణయించుకొనవచ్చును. హాయి యగు నీ యేర్పాటు అత్యంతమగు నావేశమును జనింప జేయునుగదా!"



# పిల్లల పుస్తకాలు : సోవియట్ రష్యా

చిన్న పిల్లలు ఎల్లాంటి పుస్తకాలు చదవడానికి ముచ్చట పడతారనే విషయములో సోవియట్ రష్యాలో జరుగుచున్నంత కృషి ఏ యితర దేశములోనూ జరగడము లేదు. ఇందులో కొంచెమయినా అతిశయోక్తి లేదు. దేశపు భవిష్యత్తు అంతా చిన్నపిల్లల మీద ఆధారపడి వుందనీ చిన్ననాటినుంచీ వారి విద్యాబుద్ధులను గమనించకపోయే టట్లయితే దేశము సర్వనాశనమై పోతుందనీ వారి అభిప్రాయము.

అందువల్ల చిన్నపిల్లల విద్యాభ్యాస విషయములో వారు ప్రత్యేక శ్రద్ధను తీసికొంటున్నారు. ఆచిన్న పిల్లలకు అవసరమయిన పుస్తకాల నన్నిటినీ యెంతో జాగ్రత్తగా తయారు చేయిస్తున్నారు. అంతకన్నా జాగ్రత్తతో వాటిని అచ్చు వేఘించు చున్నారు. ఆ పుస్తకాలకు అవసరమయిన బొమ్మలు వ్రాయడానికి దేశ దేశాలనుంచీ చిత్రకారులను రావించినారు. ఎంతో డబ్బు అందుకోసము ఖర్చు చేసినారు.

చిన్నపిల్లల పుస్తకాలు ప్రకటించడం కోసం ఒక పెద్ద కార్ఖానము మాస్కో పట్టణములో పెట్టారు. ఆషాపుకు పిల్లల దగ్గరనుంచి ఆయా పుస్తకాలను గురించి ఉత్తరాలు వస్తూవుంటవి. వారికి ఏయే పుస్తకాలు బాగున్నవీ ఏయే పుస్తకాలు బాగుండనిదీ యథేచ్ఛగా వుత్తరాలలో వ్రాసివేస్తారు. వాళ్ల వుత్తరాలు చూస్తే చిన్న పిల్లలకు ఎంత విమర్శనాశక్తివుందీ, మంచీ చెడూ ఎంత చప్పున వాండ్లు నిర్ణయించేదిన్నీ యిట్టే తెలిసిపోతుంది.

ప్రత్యేకముగా పుస్తక ప్రచురణాలయాలే గాకుండా చిన్న పిల్లలకోసము దేశమంతటా దివ్యమయిన పుస్తక భాండాగారములను పెట్టినారు. ఆ భాండాగారాలలో పిల్లలు తమ కిష్టము వచ్చిన పుస్తకాలు తీసికొని చదువుకొనవచ్చును. 1937 వ సంవత్సరము ఆఖరుకు మాస్కో పుస్తక ప్రచురణాలయముల వారు చిన్న పిల్లల కోసము ఏడుకోట్ల పుస్తకాలను ప్రకటించినారు. ఈ యేడు కోట్ల పుస్తకాలున్నూ భాండాగారాలకు సరఫరాచేసినారట. అవి చాలలేదట. కొంతమంది పిల్లలు ఆ పుస్తకాలను కొనుక్కోవలె ననుకున్నారు. అందుకోసము తిరిగి 4 కోట్ల పుస్తకాలను ప్రచురించినారు.

చిన్న పిల్లలకు కట్టుకథ (Fairy tale) లంటే చాల యిష్టమని అక్కడి విద్యాశాఖవారు తెలుసు కొన్నారు. ప్రపంచములోవున్న అన్ని భాషలలో ప్రకటనము

అయిన కట్టుకథల పుస్తకాలను తెప్పించినారు. గ్రంథకారులు వాటిని చదివినారు. అవి ఏవిధముగా తమ భావల్లో తమ లక్ష్యాలకు అనుగుణముగా వుండవలెనో యోజించినారు. ఆవిధముగ ఆ కథల నన్నిటినీ తిరగ వ్రాసినారు. ఈ కథలే గాకుండా పిల్లలకు పాటలంటే చాలా యిష్టము. పిల్లలకు పనికివచ్చే పాటల పుస్తకాలను 1937 వ సంవత్సరము ఆఖరుకు 5 కోట్లు అచ్చువేసినారు. శైశవము వదలిపోయి కాస్త వయస్సు వచ్చిన పిల్లలు యంత్ర తంత్రాలను గురించిన కథలు చదవడానికి యిష్టపడతారు. అందుకోసము వయస్సు సంబంధమయిన కథలు వ్రాసినారు. ఇంకా కాస్త వయస్సు వచ్చిన పిల్లలు చరిత్రకు సంబంధించినవీ, దేశ దేశాలనుగురించీ పుస్తకాలు చదవడానికి కుతూహల పడుతారట. అందుకోసము వారికి ప్రత్యేక పుస్తకాలు వ్రాయించినారు. యౌవనములో వున్నవారు గొప్పవాళ్ల జీవిత చరిత్రలూ, శృంగార రస సంబంధమైన పుస్తకాలూ చదువుతారు. అందుకోసము ప్రపంచ వాఙ్మయము అంతా తరిచి వారి దేశానికి, అందులో వారి దేశములోని యువతులకు యువకులకు పనికి వచ్చేటట్లుగా అన్ని భాషలలోనుంచీ కథలూ, జీవిత చరిత్రలూ క్రోడీకరించి తిరగ వ్రాసినారు.

ఈవిధముగా ఈ నాటికి చిన్న పిల్లల కోసము 12 కోట్ల 8 లక్షల పుస్తకాలు ప్రత్యేకముగా వ్రాయించి ప్రతి పుస్తకానికిన్నీ అవసరమయిన బొమ్మలు తయారు చేయించి సోవియట్ రష్యావారు ప్రకటించినారు.

[6-3-40 వ తేదీ 'ఆనందవాణి' వారపత్రికనుండి]



# సమాచారాలు - సలహాలు

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

### ఆం. దే. గ్రం. సంఘ సమావేశములు

14-4-40 వ తేదీ పా. వ. సభ్యుల అంగీకారము నిమిత్తము పంపబడిన క్రింది తీర్మానములపై శ్రీమల్లెల శ్రీరామమూర్తి, నాగినేని వెంకయ్య, పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, మారేపల్లి రామచంద్రశాస్త్రి, తాడిమేటి కుటుంబశాస్త్రి, తేతలి సత్యనారాయణమూర్తిగార్లు మాత్రము తమ అభిప్రాయములను వ్రాసిరి.

తీర్మానములు :

౧. ప్రమాది సం॥ నకు సభ్యులను జేర్పించు గడువు 1940 సం॥ ఏప్రిల్ నెలాఖరువరకు పొడిగించుటకు తీర్మానించుచు, మే 5 వ తేదీ లోపల పాలకవర్గసభ్యులు, శాఖాసంఘములు తమతమ లెక్కలను రశీదు పుస్తకములతో సహా సంఘకార్యస్థానమునకు తప్పక చేర్చవలసినదిగ కోరడమైనది.

దీనికి పై సభ్యులందరు తమ ఆమోదమును తెలిపిరి.

౨. ఈసంఘమునకుగాను రు 40/ లకు మించకుండ 1 సైకిలు కొనుటకును, నెల 1కి రు 10-0-0 మొదలు రు 15-0-0 మధ్య వేతనముపై కార్యాలయము పనిని చూచుటకొక కార్యాలయ కార్యదర్శిని నియమించుటకును కార్యదర్శికధికారమిచ్చుచు, ఇందు కవసరమైన ధనమును భవన నిర్మాణనిధినుండి వెచ్చించుట కంగీకరించడమైనది.

దీనినిగూర్చి పైసభ్యులు తలకొక అభిప్రాయమును వెలిబుచ్చియున్నందున మరుసటి పాలకవర్గ సమావేశమునకు తీర్మానము నాపియుంచుట కేర్పాటు చేయడమైనది.

(సం.) పా. నాగభూషణం
కార్యదర్శి

11-8-40 వ తేదీ మధ్యాహ్నము 1 గంటకు ఆం. దే. గ్రం. సం. పాలకవర్గము తెనాలి మారీసుపేటలోని ఆంధ్రరత్నగ్రంథాలయమునందు సమావేశమై చేసిన తీర్మానములు.

హాజరు: శ్రీ పాటూరి నాగభూషణం, శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరం, శ్రీ నాగినేని వెంకయ్య, శ్రీ పూటుకూరు జయరామదాసు, శ్రీ సూరపనేని వెంకటరత్నం.

తీర్మానములు :

౧. ఈసభకు అధ్యక్ష, ఉపాధ్యక్షులలో నెవ్వరుగాని హాజరు కానందున శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరంగారిని అధ్యక్షులుగ నెన్నుకొనడమైనది.

౨. 14-4-40 వ తేదీ పా. వ. సభ్యుల అంగీకారము నిమిత్తము పంపబడిన రెండవ తీర్మానమును సర్వసభ్యసభలో చర్చించుటకు నిలుపుదల చేయబడినది.

3. కార్యదర్శిచే తయారు చేయబడిన 1939-40 సం॥ కార్యనివేదికను అంగీకరించడమైనది. దీని నచ్చొత్తించి ప్రచురించుటకు కార్యదర్శి కధికార మీయడమైనది.

౪. 1940-41 సం॥ బడ్జెటు సర్వసభ్యసభలో చర్చించుటకు ఆపుదల చేయబడినది.

౫. సంఘోద్దేశములను క్రింద నుదహరింపబడిన విధమున మార్చుటకు అంగీకరించుచు 1940 సం॥ సెప్టెంబరు 1 వ తేదీ మధ్యాహ్నము 1 గంటకు తెనాలి మారీసుపేటలోని ఆంధ్రరత్నగ్రంథాలయములో సర్వసభ్యసభయొక్క సమావేశమును ఇందునిమిత్తము జరుపుటకు కార్యదర్శిని కోరడమైనది.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమ వ్యాప్తికై క్రింది సాధనముల ద్వారాను, ఇందులకు విరుద్ధముగాని ఇతరసాధనముల ద్వారాను కృషిచేయుట ఈసంఘోద్దేశమైయున్నది.

1. ఆంధ్రదేశమందంతటను గ్రంథాలయములను, పఠనమందిరములను విరివిగా స్థాపించుట, వాని నీసంఘమున సభ్యులుగ జేర్చుకొనుట.
2. బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమున కంతటికిని ఒక కేంద్రగ్రంథాలయమును, దానికనుబంధముగ గ్రంథాలయముల నిర్వహణవిషయమై సలహాలనిచ్చు నిమిత్తమొక సమాచార కేంద్రమును (Information Bureau) నిర్వహించుట.
3. ఆంధ్రదేశమున నలుమూలల గ్రంథాలయోద్యమాభివృద్ధికై కృషిచేయు నిమిత్త మీ సంఘమున కన్నిప్రాంతముల శాఖాసంఘముల నేర్పాటుచేయుట.
4. ఉపన్యాసములు, కరపత్రములు, పత్రికలు, ప్రదర్శనములు మున్నగు సాధనముల ద్వారా జనసామాన్యమునందు విజ్ఞానవ్యాప్తిని, గ్రంథాలయ ప్రబోధమును గావించుట.
5. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలిగించుటకు సాధనములుగా నుండు జాతీయసంస్థాపనలను కాలాను సరణముగ నుద్ధరించుట.
6. గ్రంథాలయముల కవసరమైన సకలవిధగ్రంథములను, వివిధవిషయములను గూర్చినగ్రంథపట్టికలను, రిజిష్టర్లు వగైరా పరికరములను తయారుచేయించి ప్రకటించుట, వానిప్రకటనకై సహాయపడుట.
7. సుశిక్షితులగు గ్రంథభాండాగారులను తయారుచేయుట.
8. గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడునట్టి శాసననిర్మాణమునకై కృషిసల్పుట.
9. సంఘాభివృద్ధికిని, వ్యక్తివికాసమునకును సాధనభూతములైన సారస్వత, వైజ్ఞానిక, చారిత్రకాది పరిశోధనల ప్రోత్సహించుట.
10. ఈసంఘోద్దేశములు గలిగిన ఇతరసంఘములతో కలసిపనిచేయుట, అట్టివానితో సంబంధమును కలుగజేసికొనుట.
11. ఇందునిమిత్త మవసరమైన ధనమును, స్థిరచరాస్తులను సంపాదించుట, వినియోగించుట.

౬. కార్యక్రమములో 'సంఘనిర్మాణమును కట్టుదిట్టముగనుంచుట', 'కార్యదర్శి, సభ్యులు ప్రవేశపెట్టు ఇతరవిషయములు సర్వసభ్యసభలో చర్చించుటకు ఆపుదలచేయబడినది.

(సం.) పుణ్యమూర్తుల రాజశేఖరం
సభాధ్యక్షులు

17–8–40 వ తేదీ శనివారం మధ్యాహ్నము 2 గంటలకు ఆం. దే. గ్రం. సంఘ సర్వసభ్యసమావేశము దుగ్గిరాలలోని శ్రీభాషాభిలాషిణీ సంఘ గ్రంథాలయభవనమున సమావేశమై చేసినతీర్మానములు.

హాజరుసభ్యులు : 27 మంది

తీర్మానములు :

౧. ఈసభకు అధ్యక్షులు, ఉపాధ్యక్షులు హాజరుకానందున శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారిని అధ్యక్షులుగ ఎన్నుకోవడమైనది.

౨. 1939–40 సం॥ (ఇరువదిఆరవసంవత్సరపు) కార్యనివేదిక చదివి ఏకగ్రీవముగ ఆమోదించడమైనది.

3. 1940–41 సంవత్సరమునకు ఈదిగువ వారిని పాలకవర్గముగ ఎన్నుకోవడమైనది.
అధ్యక్షులు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఉపాధ్యక్షులు : మారేపల్లి రామచంద్రశాస్త్రికవి, నాగినేని వెంకయ్య, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగార్లు.
కోశాధిపతి : శ్రీ కొమ్మా సీతారామయ్యగారు
కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు
సహాయకార్యదర్శులు : శ్రీమల్లెల శ్రీరామమూర్తి, నరసింహదేవర సత్యనారాయణగార్లు.
సభ్యులు : శ్రీపీతాంబరం వెంకటకృష్ణమాచార్యులు, వేగేశిన సూరపరాజు, సూరపనేని వెంకటరత్నం, అడుసుమల్లి శ్రీనివాసరావు, చుండూరు కన్నయ్యశ్రేష్ఠి, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి, వట్టికోట ఆళ్వారుస్వామి, కల్లూరు సుబ్బారావు, శరణు రామస్వామిచౌదరిగార్లు.
తక్కిన ఖాళీలకు సభ్యులను చేర్చుకొనుటకు పాలకవర్గము వారికి అధికార మీయడమైనది.

౪. 1940–41 సం॥ నకు దిగువ నుదహరించిన బడ్జెటు అంచనా ఆమోదించడమైనది.

ఆదాయము

| రు. అ. పై. | |
|---|---|
| 28—7—0 | ప్రారంభనిల్వ |
| 701—9—0 | చందాలు, విరాళములు |
| 2500—0—0 | భవననిర్మాణనిధి వసూలు |

వ్యయము

| | రు. అ. పై. |
|---|---|
| ఇవ్వవలసిన బాకీలు | 100—0—0 |
| నివేదిక అచ్చు | 35—0—0 |
| అచ్చు, స్టేషనరీ | 50—0—0 |
| ప్రయాణపు ఖర్చులు | 100—0—0 |
| పోస్టు ఖర్చులు | 40—0—0 |
| ప్రచారపు ఖర్చులు | 250—0—0 |
| పుస్తకములు, సామానులు | 50—0—0 |
| ఇతరసంస్థలకు విరాళములు | 25—0—0 |
| చిల్లర ఖర్చులు | 50—0—0 |
| భవననిర్మాణమునకు | 2500—0—0 |
| అంత్యనిల్వ | 30—0—0 |

3230—0—0 మొత్తము 3230—0—0

౫. కార్యదర్శిచే తయారుచేయబడిన కేంద్ర, శాఖాసంఘములకు సంబంధించిన ప్రణాళికను* ఈ సంఘమువారు ఏకగ్రీవముగ ఆమోదించుచున్నారు. మఱియు 1940 సం॥ మే నెలారంభము నుండి దీనిననుసరించి సంఘకార్యక్రమమును సాగించుటకు కార్యదర్శి కధికారమిచ్చుచున్నారు.

(సం.) అయ్యంకి వెంకటరమణయ్య,
సభాధ్యక్షులు

1-9-40 వ తేదీ ఆదివారము మధ్యాహ్నము 1 గంటకు తెనాలి మారీసుపేటలోని శ్రీ ఆంధ్ర రత్నగ్రంథాలయ భవనమున ఆం. దే. గ్రం. సంఘ సర్వసభ్య సభయొక్క ప్రత్యేక సమావేశము సంఘోద్దేశములను మార్పుచేయుటకై జరిగెను.

హాజరుసభ్యులు : స్వయముగ 24 మంది - ప్రాక్సీవలన 29 మంది.

తీర్మానములు :

౧. ఈ సభకు అధ్యక్ష, ఉపాధ్యక్షులలో నెవ్వరుగాని హాజరుకానందున శ్రీయుత శరణురామస్వామిచౌదరిగారిని సభాధ్యక్షులుగ ఎన్నుకొనడమైనది.

౨. ప్రాక్సీలు క్రమముగ లేనందున నిర్ణీత సంఖ్య లేని కారణముచే సమావేశము నిలుపుదలచేయుబడినది.

(సం.) శ. రామస్వామి చౌదరి
సభాధ్యక్షులు

---

## ద్వితీయ రాష్ట్రేతర ఆంధ్రగ్రంథాలయ మహాసభ, కల్యాణి

కల్యాణినగర పురపాలక సంఘభవనమున 26-5-40 వ తేదీని పై మహాసభ బొంబాయి విల్సన్ కళాశాలయందు అర్థశాస్త్ర చారిత్ర అధ్యాపకులగు శ్రీ ప్రతాపగిరి రామమూర్తి ఎం. ఏ., గారి అధ్యక్షతను సమావేశమయ్యెను. సభకు పలు ప్రదేశములనుండి ప్రతినిధు లరుదెంచిరి.

బొంబాయి హైకోర్టు అడ్వొకేటు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల నృసింహాచార్యులుగారు సభను ప్రారంభించుచు గ్రంథాలయోద్యమము దేశదేశముల నెట్లు సాగింపబడుచున్నదీ, గ్రంథాలయముల వ్యాప్తివలన వాఙ్మయముతో పాటు జాతీయత యెట్లు పెంపొందునదీ వివరించుచు మహోపన్యాసమును గావించిరి.

ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ దండి సారంగపాణినాయుడుగారు తమ స్వాగతోపన్యాసమును చదువుచు ఆంధ్రుల పూర్వపు ఔన్నత్యమును, తదుపరి పతనమును విపులముగ నుడివి ప్రతి ఆంధ్రుడును తన భాషాపోషణద్వారా వ్యక్తి, దేశౌన్నత్యముల కాపాడుకొన ప్రయత్నించవలసినదిగ హెచ్చరించిరి.

సభాధ్యక్షులు తమ ఉపన్యాసమునందు గ్రంథాలయోద్యమ ప్రాశస్త్య ప్రాచీనతలను వివరించిన పిమ్మట క్రిందివిధముగ చెప్పిరి. "పాశ్చాత్యదేశములందీ యుద్యమము చాల చురుకుగ పనిచేయుచున్నది. ఏ దేశములో ఎన్ని గ్రంథములున్నవో, ఎన్ని గ్రంథాలయములున్నవో వానిపై ఆ దేశపు నాగరికతను లెక్కించుచున్నారు. మన దేశములో ఈ యుద్యమమింకను శైశవదశ యందున్నది. నూటికి 90 మంది విద్యావిహీనులుగ నున్న మన దేశములో గ్రంథాలయములకు చాల ప్రాముఖ్యతనీయవలసియున్నది.

---

* ఈ ప్రణాళిక 'ఆంధ్రగ్రంథాలయం' 2వ సంచికలో 102-104 పేజీలలో ప్రకటింపబడినది.

మనమీనాడేయుద్దేశముతో సమావేశమైయున్నామో ఆ ఉద్దేశమును కార్యాచరణలో నుంచ ప్రయత్నించిన అన్ని విషయములలోను దౌర్భాగ్యస్థితియందున్న మన దేశము నుద్ధరించిన వారమగుదుము.''

అధ్యక్షుల ప్రసంగానంతరము క్రింది ముఖ్యతీర్మానములు సభలో చర్చింపబడి ఆమోదింపబడెను.

1. బొంబాయి విశ్వవిద్యాలయమువారు మెట్రిక్యులేషను వరకును పాఠశాలలందు తెలుగునుంచు ఏర్పాటుగావించినందులకు వారినభినందించి కృతజ్ఞతను తెలుపుచున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు రాష్ట్రేతరాంధ్రుల బాలబాలికలకు పాఠశాలలందు శిక్షణపొందకనే పరీక్షనిచ్చు సౌకర్యములు కలుగ జేసినందుల కీసభవారు వారి నభినందించుచు ఇంకను నిట్టిఅవకాశముల కలిగింప ప్రార్థించుచున్నారు.

2. వాఙ్మయ, దేశాభ్యుదయములకు కారణకందములగు గ్రంథాలయములు ముఖ్యావసరములు గనుక రాష్ట్రేతరములందుండు ఆంధ్రులెచ్చటెచ్చట నుండిన అచ్చటచ్చట నొక గ్రంథాలయమును నెల కొల్పి తదభివృద్ధికి పాటుపడవలయునని ఈసభవారు ఆశించుచున్నారు.

3. ఆంధ్రుల ఆశయములు ఆదర్శములు జయప్రదముగను కల్యాణవంతముగను సాధించుటకు ప్రత్యేకాంధ్రరాష్ట్రము అవసరముగనుక ఆంధ్రులెల్లరును నిరంతరము ఇష్టసిద్ధికై కృషిసలుపుదురుగాక యని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

## పశ్చిమ గోదావరిజిల్లా : గ్రంథాలయ మహాసభలు

9-6-40 వ తేదీ మధ్యాహ్నం నరసాపురం తాలూకా పోడూరుగ్రామంలో పశ్చిమగోదావరి జిల్లా నాల్గవ గ్రంథాలయ మహాసభయు, నరసాపురం తాలూకా ద్వితీయ గ్రంథాలయ మహాసభయు వరుసను శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, వేగేశ్న నూరపరాజుగార్ల అధ్యక్షతలక్రింద సమావేశ మయ్యెను. అధ్యక్షులును జిల్లాలోని మరికొందరు ప్రముఖ గ్రంథాలయసేవకులును గ్రంథాలయాలకు సంబంధించిన వివిధ విషయములను గూర్చి ముచ్చటించిరి. శ్రీ మల్లంపల్లి నాగభూషణం అయ్యవారు 'భగవద్గీత – కర్మయోగ ప్రాశస్త్యము'నుగూర్చి ఉపన్యసించిరి.

అనంతరం గ్రంథాలయోద్యమాభివృద్ధి కుపకరించు తీర్మానములు కొన్ని చేయబడెను. గ్రామ గ్రంథాలయములకు తెప్పించదగిన గ్రంథముల పట్టికలను 3 రకములుగ తయారుచేయుటకై ఉపసంఘ మొకటి నియమింపబడెను. జిల్లాలో గ్రంథాలయప్రచారమును, వయోజన విద్యాప్రచారమును గావించుటకు కొందరు కోరబడిరి. పంచాయతీలు పత్రికలు వగైరా పంచాయతీ పాలనలోనున్న గ్రంథాలయములకు తెప్పించుటకు లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరు అనుమతి యుండవలెనని జారీచేసిన ప్రభుత్వమువారి సర్క్యులరు రద్దుచేయుటకు కోరబడెను. జిల్లాలోని గ్రంథాలయముల చరిత్రను తయారుచేసి ఆం. దే. గ్రం. సంఘము ద్వారా అఖిలభారత గ్రంథాలయ సంఘమువారి కందజేయు టకై శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు కోరబడిరి.

సభాంతమున పశ్చిమగోదావరిజిల్లా గ్రంథాలయ సంఘమునకు క్రిందిసభ్యులు కార్యనిర్వాహ కులుగ ఎన్నుకొనబడిరి.

శ్రీభూపతిరాజు తిరుపతిరాజుగారు, అధ్యక్షులు; డాక్టరు తేరలి సత్యనారాయణమూర్తిగారు, ఉపాధ్యక్షులు; డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మ, జటావల్లభుల పురుషోత్తంగార్లు సంయుక్త కార్యదర్శులు; తాలూకాగ్రంథాలయ సంఘముల అధ్యక్ష కార్యదర్శులు, జిల్లాబోర్డు అధ్యక్షులు, తాడి మేటి కుటుంబశాస్త్రి, దామెర్ల వెంకటరత్నం, ఉప్పలూరి పట్టాభిరామయ్య, మందలపర్తి ఉపేంద్ర శర్మ, బుచ్చి లింగప్పగార్లు సభ్యులు.

## గుంటూరు మండల గ్రంథాలయమహాసభ, గుండిమెడ

16—6—40 వ తేదీ సాయంత్రం 4 గంటలకు 12 వ గుంటూరు మండల గ్రంథాలయ మహాసభ గుంటూరు తాలూకా గుండిమెడ శ్రీ పిడికిటి సోదరుల గృహాంగణమున కళ్యాణమంటపమునందు శ్రీయుత అడుసుమల్లి శ్రీనివాసరావుగారి అధ్యక్షతను కూడెను.

ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ సత్తెనపల్లి హనుమంతరావుగారు స్వాగతోపన్యాసమును చదివిన పిమ్మట అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసమున గుంటూరు మండల గ్రంథాలయోద్యమమున నీసభతో నూతనాధ్యాయము ప్రారంభమైనదనియు, ఇంతకుపూర్వ మీసభలు ఇతరసభలతో చేర్చి జరుపబడుటవలన వీనికి ప్రాముఖ్యము లేకపోవుటయు, వేరుగ నడుపబడుచో సభలకు ఎక్కువమంది ప్రతినిధులు రాకపోవుటయు సంభవించుచుండెననియు, ఇపుడా రెండుచిక్కులు తొలగుటకు మంచి మార్గము చిక్కెననియు చెప్పిరి. మఱియు గ్రంథాలయోద్యమం కేవలం వ్యక్తులమీద ఆధారపడి నడచుట దీని అభివృద్ధికి చాల నిరోధకమనియు, అందరు చేరి శ్రద్ధవహించి దీనిని సాగించిన గాని మనము ముందుకు పోజాలమనియు హెచ్చరించిరి.

అనంతరము సభకు విచ్చేసిన గ్రంథాలయ సేవకులను ప్రతినిధులను శ్రీ పాతూరి నాగభూషణం గారు సభాసదులకు పరిచయముచేసిరి. పండిత మదనమోహన విద్యాధర్ గారు (ఆర్యసమాజ ప్రచారకులు) ఆదికాలమునుండియు భారతదేశమున విజ్ఞానవ్యాపనోద్యమ మెట్లు సాగినదీ హిందీలో ఉపన్యసించ పండిత గోపదేవ్ దార్శనికులు తెనుగున అనువదించిరి. శ్రీమతి అన్నాప్రగడ సరళాదేవిరావుగారు 'విద్యాలయాలు, గ్రంథాలయాలు పరస్పర సహకారముతో పనిచేయ వలసిన అవసరము'నుగూర్చి శ్రీయుత శరణురామస్వామిచౌదరిగారు గుంటూరుమండల మందలి గ్రంథాలయోద్యమ ప్రాబల్యమును గురించిచెప్పిరి. తదుపరి దివంగతులైన గిడుగు రామమూర్తి పంతులు మున్నగు సారస్వతసేవకుల మరణములకు సానుభూతినిదెలుపుచును, గ్రంథాలయముల నిర్వహణము నందును, వాని స్థాపనయందును పంచాయతీబోర్డులకును తదితరస్థానిక సంస్థలకును గల స్వాతంత్ర్యమును హరించు మద్రాసు ప్రభుత్వమువారి ఇటీవలి చర్యను నిరసించుచును, ఆంధ్రగ్రంథాలయోద్యమానికి ఆధారభూతమైన ఆం. దే. గ్రం. సంఘమున సభ్యులుగ జేరుటకును దాని కార్యక్రమమున కన్నివిధములతోడ్పడుటకును దేశీయులను, పంచాయతీబోర్డులు, సహకారసంఘములు మున్నగు ప్రజా సంస్థలను కోరుచును తీర్మానములు చేయబడెను.

అధ్యక్షుని అంత్యోపన్యాసమునకు శ్రీనాగేశ్వరం సుందరశర్మగారు చదివిన పద్యములతోడు గాగా సభికులెల్లరు ప్రబోధింపబడిరి. వందనసమర్పణముతో సభ జయప్రదముగ 7 గంటలకు సరిగ ముగిసెను.

## తెనాలితాలూకా గ్రంథాలయమహాసభ, క్రాప

1940 సం. ఏప్రిల్ 20, 21 వ తేదీలలో తెనాలితాలూకా 9 వ గ్రంథాలయమహాసభ కొల్లూరుఫిర్కా క్రాప గ్రామమున విద్వాన్ వడ్లమూడి వెంకటరత్నంగారి అధ్యక్షతను కూడినది. 20 వ తేదీ సాయంత్రం 5 గంటలకు శ్రీ సుజనవిధేయ గ్రంథాలయ పక్షమున ఆహ్వానసంఘాధ్యక్షులగు చెరుకూరు వెంకటరత్నంగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చుచు తమ ఉపన్యాసమును చదివిరి. అనంతరము అధ్యక్షులు 'గ్రంథాలయములు - వానినిర్వహణము, వయోజన విద్యాప్రచారములను' గూర్చి గంటకుపైగ నుపన్యసించిరి.

మరుసటి దినము ఉదయము 7 గంటలకు సభ తిరిగి సమావేశమయ్యెను. ఆంధ్రదేశగ్రంథాలయ సంఘము వారీ సందర్భమున నొక చక్కని గ్రంథప్రదర్శనమును ఏర్పాటుచేసిరి. శ్రీ పాతూరి నాగ

భూషణం, కాండూరి సీతారామయ్య, పుచ్చా సత్యనారాయణ, కోగంటి రాఘవయ్య, వెంపటి కోటేశ్వరశాస్త్రి, బొల్లు వీరరాఘవయ్యగార్లు గ్రంథాలయములకు సంబంధించిన వివిధవిషయములను గూర్చి ప్రసంగించిరి. ఉపన్యాసముల అనంతరము గ్రంథాలయోద్యమాభివృద్ధికి తోడ్పడు తీర్మానములు కొన్ని చేయబడి అధ్యక్షుని అంత్యోపన్యాసముతోను, వందనసమర్పణముతోను సభముగిసెను.

తీర్మానములలోని ముఖ్యాంశములు :

(1) గ్రంథాలయములకు లోగడ నిచ్చుచుండిన ప్రభుత్వ విరాళములను పునరుద్ధరించుటకు గ్రంథాలయములకు రిజిస్ట్రేషను రుసుమును రు 5-0-0 లకు తగ్గించుటకై ప్రభుత్వమును కోరుట

(2) గుంటూరుజిల్లా బోర్డువారు గ్రంథాలయముల కిచ్చుచున్న గ్రాంటు మొత్తమును హెచ్చించుచు కేంద్రగ్రంథాలయములకు ప్రత్యేక విరాళముల నిచ్చునట్లు వారిని కోరుట

(3) మద్రాసు ఆల్ ఇండియా రేడియో స్టేషనువారిని గ్రంథాలయ ప్రచారకోపన్యాసములు తరచుగ తెలుగులో నిప్పించుటకై ఏర్పాటుచేయగోరుట

(4) ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు మూలవిరాట్టుగనున్న ఆం. దే. గ్రం. సం. సభ్యులుగ జేరియు, 'ఆంధ్రగ్రంథాలయం' పత్రికకు చందాలనిచ్చియు, దానిభవననిర్మాణమునకు సహాయముజేసియు తోడ్పడవలసినదిగ తాలూకాలోని ప్రజలను, ప్రజాసంస్థలను హెచ్చరించుట; గ్రంథభాండాగారులకు శిక్షణ తరగతుల నేర్పాటుచేయుటకై సదరు సంఘమువారిని కోరుట

(5) గ్రంథాలయోద్యమ వ్యాప్తికి దోహదమునిచ్చు ప్రకటనలు, వార్తలు, వ్యాసములు వగైరాలను తరచు ప్రకటించుచుండుటకై తెలుగు పత్రికలను హెచ్చరించుట

(6) పంచాయతీబోర్డులు గ్రంథాలయముల నిర్వహించుటకై ఆటంకములు కల్పించుచున్న మద్రాసు ప్రభుత్వమువారి నెం 445 రు సర్క్యులరుపై తీవ్రమగు అసమ్మతిని వెలిబుచ్చుచు దీనిని రద్దుపరచుటకై గవర్నరుగారినికోరుట.

## నరసరావుపేట తాలూకా గ్రంథాలయ మహాసభ, కనుపర్రు

29-1-40 వ తేదీ కనుపర్రు గ్రామమున శ్రీ గాంధీ సారస్వత నిలయమువద్ద నరసరావుపేట తాలూకా 3 వ గ్రంథాలయ మహాసభ గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ కల్లూరి చంద్రమౌళి బి. యస్. సి., యం. యల్. యే. గారి అధ్యక్షతను సమావేశమయ్యెను. త్రివేణీ పత్రికా సంపాదకులు శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు సభను ప్రారంభించుచు ప్రజాశ్రేయస్సు నిమిత్తం నడుపబడు సకలోద్యమములు గ్రంథాలయోద్యమముపై ఆధారపడి యున్నవనియు, వెంకటరమణయ్య ప్రభృతులు ఆంధ్రదేశమున నీయుద్యమమునకు పునాదివేసిరనియు, గ్రామ గ్రామమున గ్రంథాలయము లేర్పడి యువకులు వీనిని కట్టుదిట్టముతో సాగించిన త్వరలో దేశమభివృద్ధి చెందుటకు చక్కని అవకాశము లున్నవనియు నుడివిరి

అధ్యక్షులు తమ ఉపన్యాసమున మానవుని ఆధిక్యతకు జ్ఞానమే కారణమనియు, జ్ఞాన సంపాదనమునకు గ్రంథాలయములకు మించిన సాధనములు లేవనియు, గ్రంథాలయ నిర్వాహకులు తమ పుస్తకములను, బీరువాలను చూచుకొని మురియుటవలనగాక తాము సేకరించిన గ్రంథములను ప్రజల కుపకరించునట్లు చేయుటయే వాని ప్రయోజనమనియు నొక్కి చెప్పిరి.

కార్యదర్శి నివేదిక చదివిన తరువాత శ్రీ గుంటుపల్లి వేంకటేశ్వరరావు, వంకాయలపాటి శేషావతారం, ముక్తినూతలపాటి హనుమంతరావుగార్లు తాలూకాలోని మరికొందరు గ్రంథాలయ సేవకులు గ్రంథాలయ నిర్వహణమున తమ అనుభవములను వెల్లడించిరి. శ్రీ పాతూరి నాగభూషణంగారు

గ్రంథాలయ సేవకుల ధర్మములు, గ్రంథాలయ నిర్వహణావిధానము, గ్రంథాలయోద్దేశములగూర్చి మాట్లాడిరి. పిమ్మట గ్రంథాలయోద్యమ వ్యాప్తికి తోడ్పడవలసినదిగ ప్రభుత్వమును కోరుచును; గ్రంథాలయప్రచారమునకై తరచు ఉపన్యాసముల నిప్పించుచుండుటకై మద్రాసు ఆల్ ఇండియా రేడియో స్టేషనువారిని కోరుచును; ఆం. దే. గ్రం. సంఘమున సభ్యులుగచేరి 'ఆంధ్రగ్రంథాలయం' పత్రికను తెప్పించుకొనవలసినదిగ తాలూకాలోని గ్రంథాలయములను హెచ్చరించుచును; దేవిడిజమీందారుగారు ప్రచురించుచున్న 'ఆంధ్రవిజ్ఞానము'నకు తగిన ప్రోత్సాహ మిచ్చుటకై గ్రంథాలయముల హెచ్చరించుచును తీర్మానములు కొన్ని చేయబడి 1910-41 సం॥ నకు క్రిందివారు నరసరావుపేట తాలూకా గ్రంథాలయ సంఘమునకు కార్యనిర్వాహకవర్గముగ ఎన్నుకొనబడిరి.

శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు, బి. ఏ., బి. ఎల్., యం. యల్. యే., అధ్యక్షుడు; శ్రీ గుంటుపల్లి వెంకటేశ్వరరావుగారు, ఉపాధ్యక్షుడు; శ్రీ కెనుపర్తి రామకృష్ణశర్మ, కార్యదర్శి; శ్రీ ముక్తినూతలపాటి హనుమంతరావుగారు, కోశాధిపతి; శ్రీ వంకాయలపాటి శేషావతారం, ద్రోణాదుల పుల్లయ్య, నల్లపాటి ఆంజనేయులు, పోతరాజు విశ్వనాథశర్మ, పెండ్యాల జగన్నాథం, గడ్డం అంకిరెడ్డిగార్లు సభ్యులు.

అధ్యక్షుని అంత్యోపన్యాసము, వందన సమర్పణములతో సభ సమాప్తమయ్యెను.

## సత్తెనపల్లి తాలూకా గ్రంథాలయ సంఘం

27-1-40 వ తేదీ పై సంఘసభ్యులు సత్తెనపల్లి తాలూకా కాంగ్రెసు కార్యాలయమందలి శ్రీ బత్తుల రామదాసుగారి అధ్యక్షతను కూడి 1939 - 40 సం॥నకు క్రిందివారిని కార్యనిర్వాహకులుగ ఎన్నుకొనిరి.

శ్రీ మోర్తల అమరారెడ్డిగారు, అధ్యక్షుడు; శ్రీ కడియం వీరాచార్యులుగారు, కార్యదర్శి; శ్రీ పోణుకుపాటి జానకిరామయ్య, ఆమంచి నరసింహారావు, నెమలికంటి మృత్యుంజయరావు, బత్తుల రామదాసు, దాట్లగురవరాజు, తూము వేంకటేశ్వర్లు, వంకాయలపాటి వీరయ్యగార్లు సభ్యులు.

సత్తెనపల్లి తాలూకా గ్రంథాలయ మహాసభను 1940 సం॥ ఏప్రిల్ మాసములో జరుపుటకు తీర్మానింపబడి సంఘనిబంధనల తయారుచేయుటకై పాలకవర్గము వారి కధికార మీయబడెను.

## బెజవాడ తాలూకా గ్రంథాలయ మహాసభ, కోలవెన్ను

12-5-40 వ తేదీ కోలవెన్ను గ్రామములో బెజవాడతాలూకా తృతీయ గ్రంథాలయ మహాసభ శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయ భవనమున కూడెను. బెజవాడ కాలేజి ప్రిన్సిపాల్ డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, యం. యే., పి హెచ్. డి. (లండను) గారధ్యక్షత వహించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ యలమంచిలి బసవయ్యగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చుచు గ్రంథాలయ సభలు నిర్వహణ సమస్యల పరిష్కరించుటకును, ప్రజలలో ప్రబోధము గలిగించి ప్రభుత్వము వీని విషయమై శ్రద్ధవహించునట్లు చేయుటకును ఏర్పడెనియు, ధనవంతు లీయుద్యమమును పోషించుచో దీనికి నక్కర్లేని దోహదము చిక్కగలదనియు చెప్పిరి. సభా ప్రారంభకులగు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు భారతదేశ విద్యావిధానమును గూర్చియు, విదేశములందు నడచుచున్న గ్రంథాలయోద్యమమును గూర్చియు చెప్పి జన సామాన్యములో పూర్ణమైన విద్యావ్యాప్తి కలిగిననాడే దేశమునకు ముక్తి గలదనియు, దీనివ్యాప్తికై సహకార సంఘములాదిగాగల ప్రజాసంస్థలు పూనుకొనవలెననియు ఉపన్యసించిరి.

అధ్యక్షులు సౌఖ్యజీవితానికి సంస్కృతి చాల అవసరమనియు, భావదాస్యముచే మన ఆలోచనా శక్తి పూర్తిగ నశించినదనియు, దీనిని పోగొట్టుకొనుటకు గ్రంథాలయములు బాగుగ తోడ్పడ గలవనియు, వీని నిర్వహణకై ప్రజలందరు తోడ్పడిన త్వరలో దేశకల్యాణము సిద్ధించుననియు విపులముగ నుడివిరి. ఆం. దే. గ్రం. సం. కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారును మరికొందరును గ్రంథాలయోద్యమ ప్రాశస్త్యమునుగూర్చి మాట్లాడిన పిదప క్రింది ముఖ్యతీర్మానములు గావింపబడెను.

సుప్రసిద్ధులగు సారస్వత సేవకుల మరణములకు సంతాపమును వెలిబుచ్చు తీర్మానము మొదటిది. ఆం. దే. గ్రం. సం. కార్యక్రమమునకు తోడ్పడగోరుచు తాలూకాలోని విద్యాభిమానులను, గ్రంథాలయములను, పంచాయతీబోర్డులను, సహకారసంఘములను, హెచ్చరించినది రెండవతీర్మానము. గ్రంథాలయోద్యమము పట్ల ప్రభుత్వమువారి ఉదాసీనతకు సంతాపమును వెలిబుచ్చుచు గ్రంథాలయములకు రిజిస్ట్రేషను ఫీజును తీసివేయుటకును, విరాళముల నిచ్చుటకును, వీనినిర్వహణవిషయమై పంచాయతీ బోర్డుల స్వాతంత్ర్యమునకు భంగము కలిగించకుండుటకును, గ్రంథనిషేధముల తొలగించుటకును, దేవాదాయ ధర్మాదాయముల నుండి కొంత మొత్తమును వయోజన విద్యావ్యాప్తినిమిత్తము వెచ్చించుటకును, గ్రామాదులలోని బంజరుభూములు వగైరాలను గ్రంథాలయోపయోగము నిమిత్తమై ఇచ్చుటకును చేయబడిన తీర్మానమత్యంత ప్రధానమైనది. స్త్రీలవిషయమై హరిజనుల విషయమై, గ్రంథాలయ శిక్షణావసరమును గూర్చి మరికొన్ని తీర్మానములు గావింపబడిన తదుపరి 1940 - 41 సం॥నకు క్రిందివారిని బెజవాడ తాలూకా గ్రంథాలయ సంఘపాలకవర్గ సభ్యులుగ నెన్నుకొని ఇతరుల నిందు చేర్చుకొనుటకును, సంఘ నిర్వహణమున కవసరమైన నిబంధనల చేసికొనుటకును అధికారమీయబడెను.

శ్రీ చోడవరపు మధుసూదనరావుగారు, బి. ఏ., బి. ఎల్., అధ్యక్షులు; వెలగపూడి దానయ్య చౌదరిగారు, ఉపాధ్యక్షులు; గొంది కోటీశ్వరరావు గారు, కార్యదర్శి; కొమ్మా సీతారామయ్య, మిక్కిలినేని పరంధామయ్య, కంభంపాటి వెంకటరత్నం, కాపా కాశీవిశ్వనాథదేవరగార్లు సభ్యులు.

---

# నూతన గ్రంథాలయాలు

## కార్పొరేషను ఉచితపఠనాలయము, మైలాపూర్

25-4-40 తేదీ సాయంత్రము శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు మైలాపూర్ మండవల్లి వీధిలో కార్పొరేషన్ ఉచితపఠనాలయమును ప్రారంభించిరి. ఈ సందర్భమున జరిగిన సభకు శ్రీ యస్. సత్యమూర్తిగారు అధ్యక్షత వహించిరి.

కమీషనరు ఒ. పుల్లారెడ్డిగారు కార్పొరేషను పఠనాలయవ్యాప్తి విధానమును వివరించుచు నగరములో 21 కార్పొరేషను స్వంతము, 43 కార్పొరేషనువారి సాయముచే నడచునట్టివి పఠనాలయములు కలవనియు, వీనికితోడు నూతనసంవత్సరములో మరి 12 క్రొత్తవానిని ప్రారంభించుట కేర్పాట్లు జరుగుచున్నవనియు తెలిపిరి.

అధ్యక్షులు వీటిని దుకాణములుగ ఎంచరాదనియు దిన, వార, పక్ష, మాసపత్రికలను ప్రజలు జాగ్రత్తతో చదువుచుండవలెననియు తెలిపిరి.

రాజగోపాలాచారిగారు తమ ప్రారంభోపన్యాసమున 'పాఠకులు పత్రికలలోని బొమ్మలు, వ్యాసములు చింపుకుపోక యుక్తముగ వాటి నుపయోగించుకొనదగుననియు, ధనికులగువారు ఎన్నియో విధముల ఈపఠనాలయములకు తోడ్పడవలసి యున్నదనియు, ప్రజలు సరిగా శ్రద్ధతీసికొన్న ప్రతి

డివిజనులోను పఠనాలయముల ప్రారంభించవచ్చుననియు, పఠనాలయమున్న ఒక్క పత్రికలనేగాక పుస్తకములుకూడా ఇందు చేర్చవచ్చుననియు చెప్పి పఠనాలయముల ముఖ్యావసరములను వివరించిరి.

సామికన్నుకన్యగారి అభివందనములతో సభ ముగిసెను.

### వనితా పఠనమందిరము, తాడేపల్లిగూడెం

5-1-40 వ తేదీ తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయసంఘ యాజమాన్యమున జరిగిన మహిళాసమావేశమున 'వనితాపఠనమందిరము' ప్రారంభింపబడెను. శ్రీమతి ఎస్. వి. రమణమ్మగారధ్యక్షత వహించిరి. స్త్రీలు విద్యావిషయికముగ పఠనాలయములవలన పొందు లాభముల గూర్చి ప్రసంగములు జరిగెను. ఈపఠనాలయమునకు ఆంధ్ర పత్రిక, గృహలక్ష్మి, ప్రజాబంధు, కాగడా, వినోదిని, మద్రాసు మెయిలు మున్నగు పత్రికలు తెప్పింపబడుచున్నవి.

## వార్షికోత్సవములు వగైరా

### శ్రీ వీరేశలింగకవి సమాజగ్రంథాలయము, కుముదవల్లి

పైగ్రంథాలయముయొక్క 42 వ వార్షికమహాసభ 7-1-40 వ తేదీ గుంటూరుమండల గ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీయుత శరణు రామస్వామిచౌదరిగారి యధ్యక్షతను జరిగెను. ఈసందర్భమున మధ్యాహ్నము 1 గంటకు పై గ్రంథాలయ స్థాపకులలో నొకరును, ఆదర్శగ్రంథాలయ సేవకులునునగు శ్రీయుత భూపతిరాజు తిరుపతిరాజుగారి ఛాయాపటమును బ్రహ్మశ్రీ చెరుకువాడ వెంకటనరసింహం పంతులుగారు గ్రంథాలయ భవనమున బహిర్గతముచేసిరి. సభకు విచ్చేసిన పలువురీ సందర్భమున తిరుపతిరాజుగారి సేవాదీక్షనుగూర్చియు, వారి గుణగణములనుగూర్చియు, వారు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి గావించిన కృషినిగూర్చియు ముచ్చటించిరి.

మధ్యాహ్నము 2 గంటలకు వార్షికమహాసభను ప్రారంభించుచు శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంపంతులుగారు దేశాభివృద్ధికి గ్రంథాలయోద్యమము హృదయమువంటిదనియు, ఆంగ్లవిద్యనభ్యసించినవారు తాము నేర్చిన విషయములను జనసామాన్యమున కందజేయుటవసరమనియు, ఈ కార్యమును నిర్వహించినవారిలో వీరేశలింగపంతులు అగ్రగణ్యుడనియు నడివిరి, అధ్యక్షులగు శ్రీ రామస్వామిచౌదరిగారు పూర్వకాలమున విజ్ఞానప్రచారమును కొన్ని కుటుంబములు చేయుచుండెడివనియు, తరువాత వ్రాత గ్రంథములు మనుష్యుల స్థానమాక్రమించినవనియు, అచ్చుయంత్రముతో పుస్తకములు ప్రబలమయ్యెననియు, బౌద్ధమహాయుగమున విజ్ఞానవ్యాప్తి దేశమున విరివిగ నుండెననియు, నేటి పరిశోధనల మూలమున ఆంధ్రవిజ్ఞానము, ఆంధ్ర తేజస్సు ఎంతటి మహోన్నతదశయందుండెనో తెలియవచ్చుచున్నదనియు మున్నగు విషయముల నుపన్యసించిరి. శ్రీ పాతూరి నాగభూషణంగారు (ఆం. దే. గ్రం. సం. కార్యదర్శి) మాట్లాడుచు గ్రంథాలయోద్యమవ్యాప్తికి ధనముకంటె దీక్షతోపనిచేసే మనుష్యులెక్కుడవసరమనియు, గ్రంథములు చదివి వానిలోని విషయమును గ్రహించి తదనుకూలముగ నడవడిని దిద్దుకొనుటవలన తప్ప దేశమునకు మోక్షములేదనియు చెప్పిరి.

డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు (ప. గో. జిల్లా గ్రం. సం. కార్యదర్శి) మరికొందరు ఉపన్యసించిన తదుపరి వందన సమర్పణతోను మంగళ సంకీర్తనతోను సభ సమాప్తమయ్యెను.

**దేశోద్ధారకుని వార్షికము:** 19-4-40 వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు శ్రీ వీరేశలింగకవి సమాజమువారి యాజమాన్యమున శ్రీ చంగల్వల చిట్టిపంతులుగారి అధ్యక్షతను దేశోద్ధారకుని వర్ధంతి మహోత్సవము కుముదవల్లిలో పై సమాజ గ్రంధాలయ భవనమున జరుపబడినది.

శ్రీ భాగవతుల నరసింహశాస్త్రిగారు నాగేశ్వరరావుగారి జీవిత విశేషాలను, ఆంధ్రదేశములో వారి సాహాయ్యమును పొందిన జనులు సంఘలు అసంఖ్యాకములుగ నున్న విషయమును చెప్పిరి. అధ్యక్షులు నాగేశ్వరరావుగారివంటి ఉత్తమవ్యక్తి ఇకముందు పుట్టుటసంభవమనియు, హరిజనోద్యమమునకు వారి మరణంవల్ల తీరని నష్టము కలిగినదనియు వచించిరి. శ్రీ ఘంటసాల నాగభూషణంగారు శ్రీవారిని స్మరించుచు పద్యములు చదివిరి. భూపతిరాజు తిరుపతిరాజు, సాగి సుబ్బరామరాజుగార్లు ఉపన్యసించిన తదుపరి అంత్యాభివందనములతో సభ ముగిసెను.

## స్వసంఘగ్రంథాలయము, విశాఖపట్టణము

పై గ్రంధాలయముయొక్క వార్షికోత్సవము 14-1-40 వ తేదీ సాయంకాలము శ్రీయుత మద్ది పట్టాభిరామిరెడ్డిగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. బ్రహ్మశ్రీ అద్వైతస్థాపనాచార్య పండిత వడ్లమాని వరహాలు శాస్త్రులవారికి గ్రంధాలయమువారు సువర్ణ కర్ణకుండలముల బహూకరించిరి. అధ్యక్షులు శాస్త్రిగారి పాండితీగరిమను, నిరాడంబరజీవితమును, మత ప్రబోధనాసక్తిని గూర్చి చెప్పి వారు సంఘమునకొసగుచున్న జ్ఞానప్రబోధమునకు కృతజ్ఞతను తెలిపిరి. కార్యదర్శి సత్యనారాయణశాస్త్రిగారు మత ప్రచారావశ్యకతను గూర్చియు, పండితపరిషత్తువారి కృషినిగూర్చియు తెలియబలికిరి. వ్యాకరణ శిరోమణి పండిత వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రిగారు, వరహాలు శాస్త్రిగారు మతమునకు చేయుచున్న మహత్తరసేవను [illegible]డించిరి. కడపటను వరహాలు శాస్త్రిగారు మతముయొక్క ఉత్కృష్టత, పరమాత్మస్వరూపము, జ్ఞానాధిక్యము మున్నగు నంశములపై విపులముగ నుపన్యసించినపిమ్మట అభివందనములతో సభముగిసెను.

## దేశోద్ధారక ఆంధ్రభాషానిలయము, మల్లేశ్వరము

17-1-40 వ తేదీ పై గ్రంధాలయమహాజనసభ శ్రీ డి. సుదర్శనరావుగారి అధ్యక్షతను జరిగెను. శ్రీ చంద్రమౌళిశాస్త్రిగారు గ్రంధాలయావశ్యకతను గూర్చియు, గ్రంధాలయములు [illegible] మును గురించియు, నాగేశ్వరరాయ జీవితమును గూర్చియు ఉపన్యసించినపిమ్మట కార్యదర్శి నివేదిక చదువబడెను.

గ్రంధాలయమునకు భవననిర్మాణము నిమిత్తము శ్రీ మల్లెం శేషగిరిరావుగారు భూదానమొసగిరి.

## శ్రీ శారదా గ్రంథాలయము, పెదకొత్తపల్లి

21-1-40 వ తేదీ సాయంత్రం పై గ్రంధాలయ ద్వితీయ వార్షికోత్సవం బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి ఆధిపత్యమున జరుపబడెను. బ్రహ్మశ్రీ ముత్తనూతలపాటి గోపాలకృష్ణయ్యగారు ప్రారంభోపన్యాసమొసంగిరి. అధ్యక్షులకు స్వాగతపత్రము సమర్పింపబడి, వార్షికనివేదిక చదువబడెను. అనంతర మధ్యక్షులు ప్రసంగించుచు ఆరంభశూరత్వమనునట్లు మన ఆంధ్రులు [illegible]కార్యము లొనరించినను కొనసాగక పోవుటవలన ఆంధ్రదేశమునకు, ఆంధ్రభాషకు లోటు గలుగుచున్నదని నుడివిరి. కార్యదీక్ష బూని ప్రతి పల్లెయందును సంఘము లేర్పడి గ్రంధాలయముల స్థాపించి భాషాసేవజేయుట ప్రతి ఆంధ్రుని కర్తవ్యమని ప్రబోధించిరి.

## శ్రీ గాంధీ సారస్వతనిలయము, కనువర్రు

24-1-40 వ తేదీ రాత్రి పై గ్రంథాలయముయొక్క వార్షికోత్సవము శ్రీ పాలకోడేటి లక్ష్మీపతి, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి. గారి అధ్యక్షతను జరిగెను. కార్యదర్శి నివేదిక చదువబడిన తదుపరి అధ్యక్షులు గ్రంథాలయ విద్యాలయముల పరస్పర సంబంధమునుగూర్చియు, ప్రస్తుత విద్యావిధానమందలి లోపములు వానిని సవరించుటకై ప్రజలు వహించదగు బాధ్యతలనుగూర్చియు విపులముగ నుపన్యసించిరి.

## ఆంధ్రరత్నగ్రంథాలయము, తెనాలి

5-2-40 వ తేదీన ఏర్పాటుచేయబడిన పై గ్రంథాలయ పునరుద్ధరణమహోత్సవము దేశనాయకుల పటములయొక్కయు, జాతీయ జెండాయొక్కయు ఊరేగింపుతో ప్రారంభమయ్యెను. శ్రీ నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు పంతులుగారు భవనోపరి భాగమున జాతీయ జెండాను ప్రతిష్ఠించి, హాలులో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణుని చిత్రపటమును బహిరంగపరచిరి. పిదప శ్రీ నిమ్మగడ్డ సోమశేఖరరావుగారు గ్రంథాలయమునకు తాము దానముగనిచ్చిన విద్యుద్దీపముల వెలిగించిరి. శ్రీ పి. గోవిందరాజులుగారు (గుంటూరు) గ్రంథాలయమునకు తాము బహూకరించిన సుమారు రు 300-0-0 విలువగల రేడియోను మొదటిసారి ఉపయోగమునందుంచిరి. కడపటకు జరిగిన బహిరంగసభకు శ్రీ పిల్లలమర్రి ఆంజనేయులు పంతులుగారధ్యక్షత వహించిరి. శ్రీ పావులూరు రామారావుగారు ఆహ్వాన సంఘపక్షమున తమ ఉపన్యాసమును చదివిరి. శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మ, మతుకుమల్లి వేంకటలక్ష్మీనరసింహారావుగార్లు గ్రంథాలయ ప్రయోజనములను గూర్చి సభలో నుపన్యసించిరి. నాగస్వరవాద్యముతో, ఆహ్వాన సంఘంవారి అభినందనములతో సభ జయప్రదముగ ముగిసెను.

## శ్రీ రామమోహన గ్రంథాలయము, ప్రత్తిపాడు

9-2-40 వ తేదీ పై గ్రంథాలయముయొక్క తృతీయ వార్షికోత్సవము శ్రీ నూరంపూడి శ్రీహరిరావు గారి అధ్యక్షతను జరిగినది. కార్యదర్శి నివేదిక చదివిన తదుపరి అధ్యక్షులు విద్యాభివృద్ధి, గ్రంథాలయోద్యమవ్యాప్తివలన దేశదారిద్ర్యమును, బానిసత్వమును, మాఢ్యమును నశించి స్వాతంత్ర్య సంపాదనకెట్లు దారితీయునో తమ ప్రారంభోపన్యాసమున వివరించిరి.

కీ. శే. చెన్నారెడ్డి రామారావునాయుడుగారి అకాలమరణమునకు సభవారు విచారమును తెలిపిన తదుపరి గ్రంథాలయమునకు నూతన కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను. అనంతరము తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులైన డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు గ్రంథాలయాభివృద్ధికి చక్కని సలహాలనిచ్చి గ్రంథాలయపక్షమున సభ్యులకు, ఉపన్యాసకులకు వందనము తెల్పుటతో సభ సమాప్తమయ్యెను.

## శ్రీ జాతీయబాలభారతీ గ్రంథనిలయము, కనగాల

12-2-40 వ తేదీ పై గ్రంథాలయముయొక్క పాలకవర్గము శ్రీ తటవర్తి వెంకటరావుగారి అధ్యక్షతను కూడెను. కీ. శే. గిడుగు వెంకటరామమూర్తి పంతులు, వరహాగిరి జోగయ్యపంతులు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగార్ల మరణములకు విచారము తెలుపబడిన పిమ్మట నూతన సంవత్సరమునకు గ్రంథాలయోద్యోగు లెన్నుకొనబడిరి. గ్రంథాలయమునకు ధనసహాయముచేయుటకై దేవాలయ మేనేజింగు ట్రస్టీగారినీ, పంచాయతీబోర్డువారిని, సహకార పరపతిసంఘమువారిని కోరుచు తీర్మానము చేయబడెను.

## ఆంధ్రగ్రంథాలయం, నౌపడా

పైగ్రంథాలయముయొక్క తృతీయవార్షికోత్సవం 26-2-40 వ తేదీ శ్రీ కె. ఎస్. గుప్తాగారి అధ్యక్షతను అత్యంతజయప్రదముగ జరిగెను. నూతన సం॥ నకు పిలకా అప్పలరాజుగారు అధ్యక్షులుగను, చెన్నూరు బుచ్చిరాజుగారు కార్యదర్శిగను మరికొందఱు సభ్యులతో కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను.

## శ్రీ వెలిదిండ్ల హనుమంతరాయగ్రంథాలయము, బెజవాడ

బెజవాడలో యువకులు కీ. శే. డాక్టరు వెలిదిండ్ల హనుమంతరావుగారి పేర బెజవాడలో నొక గ్రంథాలయమును స్థాపించి నడపుచుండిరి. దీని కొక శాఖను గాంధీనగరులో డోలీపార్కు సమీపమున 26-2-40 వ తేదిన ప్రారంభింపబడెను. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారి ఆధ్వర్యమున దీని ప్రారంభోత్సవము చేయబడెను. దీని కనుబంధముగ నేర్పాటుచేయబడిన సంచార గ్రంథాలయమును బి. యస్. మూర్తిగారు బహిరంగపరచిరి. ఈసందర్భమున బెజవాడ గోపాలరెడ్డిగారు జాతీయ పతాకము నెగురవేయుచు హనుమంతరావుగారి దేశసేవాపరాయణతను, వారిత్యాగమును ప్రశంసించిరి.

## శ్రీరామమోహన గ్రంథాలయము, బెజవాడ

పై గ్రంథాలయభవనమున 24-3-40 వ తేదీ కీ. శే. సూరి వెంకటనరసింహశాస్త్రి బి.ఏ ,బి.ఎల్. గారి ఛాయాపటమును రాయప్రోలు సుబ్బారావుగారు బహిర్గత మొనర్చిరి. ఈ సభకు బెజవాడ పురపాలక సంఘాధ్యక్షులగు శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు అధ్యక్షత వహించి నరసింహశాస్త్రిగారు ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకులుగ ఆం. దే. గ్రం. సంఘస్థాపకులుగ వారు చేసినకృషిని, అందును ముఖ్యముగ రామమోహన గ్రంథాలయమునకు వారు తోడ్పడినరీతులను ఉగ్గడించిరి.

శ్రీ దంటుసుబ్బావధాని, అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగార్లు ఉపన్యసించిన తదుపరి తుర్లపాటి వేంకటేశ్వరరావుగారి అభివందనములతో సభముగిసెను.

## శ్రీసీతారామ విజయ సరస్వతీ పుస్తకభాండాగారం, సింగుపాలెము

రేపల్లెతాలూకాలోని పైగ్రంథాలయముయొక్క పంచమవార్షికోత్సవము 30-3-40 వ తేదీ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య బ్రహ్మానందగిరిస్వాములవారి అధ్యక్షతను జయప్రదముగ జరిగెను. శ్రీ కాండూరి సీతారామయ్యగారు గ్రంథాలయప్రదర్శనమును గావించిరి. శ్రీ ఈదుప్వగంటి శివమూర్తిగారు, నోరి వెంకటప్పయ్యగారు ఉపన్యసించిరి.

## శ్రీ సుజనవిధేయ గ్రంథాలయము, క్రాప

తెనాలి తాలూకాలోని క్రాప గ్రామమందలి శ్రీ సుజనవిధేయ గ్రంథాలయ వార్షికోత్సవము కీ. శే. పూజ్యశ్రీ కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారి పుత్రికయగు డాక్టరు అచ్చమాంబగారి అధ్యక్షతను 20-4-40 వ తేదీ సాయంత్రము 4 గంటలకు అత్యంత జయప్రదముగ జరిగెను.

గ్రంథాలయ నిర్వహణవిషయమై అధ్యక్షిణి ఉపయుక్తమగు చక్కని అంశములను తమ ప్రారంభోపన్యాసమున నుడివినపిమ్మట డాక్టరు ఖండ్రిక బ్రహ్మయ్య, అగ్నిహోత్రం నరసింహాచార్యులుగార్లు గ్రంథాలయ సంబంధముగ కొంత తడవు ప్రసంగించిరి. శ్రీ పాతూరి నాగభూషణంగారు గ్రంథాలయ ప్రబోధ పద్యములను చదివిన తదుపరి అధ్యక్షిణి తుదిపలుకులు, వందన సమర్పణములతో సభ ముగింపబడెను.

### శ్రీ శారదాగ్రంథాలయం, పొణుకుపాడు

30-4-40 వ తేదీ పై గ్రంథాలయం యొక్క తృతీయవార్షికోత్సవం శ్రీమతి ఈడ్పుగంటి వెంకటరత్నమాంబగారి అధ్యక్షతను జరిగినది. శ్రీమఠం బాలసుబ్రహ్మణ్యగుప్తగారు సభను ప్రారంభించారు. గ్రంథాలయోద్యమాన్నిగూర్చి, ఆధునిక విజ్ఞానవికాసాన్నిగూర్చి, భాషాభివృద్ధినిగురించి శ్రీ పొణుకుపాటి జానకిరామయ్య, తూబాటి నాగభూషణం, ఈడ్పుగంటి శ్యామలాదేవి, వీరభద్రరావుగార్లు ఉపన్యసించారు. మహిళా ఉద్యమాన్ని గురించి వేంకటరత్నమాంబగారు మాట్లాడారు.

### శ్రీదేశోద్ధారక గ్రంథాలయము, తెనాలి

31-5-40 వ తేదీనుండి 2-6-40 వ తేది వరకు పై గ్రంథాలయముయొక్క వార్షికోత్సవపు ఏర్పాటులు చక్కగ జరిగెను. ప్రారంభమున శ్రీ రావి సత్యనారాయణగారు (పురపాలక సంఘాధ్యక్షులు) జాతీయపతాకను ప్రతిష్ఠించి గాంధీమహాత్ముని ఛాయా చిత్రమును బహిర్గతమొనర్చిరి. పైమూడు దినములలోను చింతలపూడి రామారావుగారు నాగేశ్వరరావుపంతులుగారి గుణగణములనుగూర్చియు, డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యగారు ప్రకృతి-ఆరోగ్యములగూర్చియు, కొడాలి ఆంజనేయులుగారు పట్టాభిగారి ప్రతిభనుగూర్చియు, శరణు రామస్వామిచౌదరి, అయ్యంకి వెంకటరమణయ్య, మతుకుమల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగార్లు గ్రంథాలయములు-వయోజనవిద్యనుగూర్చియు ప్రసంగించిరి.

### శ్రీ రామచంద్ర గ్రంథాలయము, పోడూరు

9-6-40 వ తేదీ మధ్యాహ్నం నరసాపురంతాలూకా పోడూరు నందలి శ్రీరామచంద్రగ్రంథాలయముయొక్క వార్షికోత్సవము గుంటూరు హిందూకాలేజీ తెలుగు పండితులు శ్రీమందలపర్తి ఉపేంద్రశర్మ ఎమ్. ఏ. గారి అధ్యక్షతను దిగ్విజయముగ జరిగినది.

### ఆంధ్రభాషా కల్పవల్లి సంఘము, సికిందరాబాదు

21-1-40 వ తేదీ శ్రీమదూరి రాఘవులుభాషాకల్పవల్లి సంఘపుటావరణమందు తత్సంఘాభివృద్ధికి తోడ్పడి భూరివిరాళముల నొసంగిన శ్రీయుత జులకంటె రాఘవులు, కీ. శే. మదూరికృష్ణయ్య బొజ్జాయోగయ్యగార్ల యొక్కయు ఛాయాచిత్రములు స్థానిక న్యాయవాదప్రముఖులగు శ్రీమాన్ సి. రంగాచారిగారిచే బహిరంగపరుపబడెను.

ఈ గ్రంథాలయమందు 1800 ఆంధ్రగ్రంథములు, 680 ఆంగ్లగ్రంథములు, 250 ఇతర గ్రంథములుగలవు. 7 దినపత్రికలు, 8 వారపత్రికలు, 6 మాసపత్రికలు వచ్చును. రాజపోషకులు, పోషకులు మొదలుగాగల 87 మంది సభ్యుల మొత్తంలో 8 మంది సభ్యురాండ్రున్నారు.

గ్రంథాలయ భవననిర్మాణంకోసం 5 గురు సభ్యులతో ఆర్థికోపసంఘ మొకటి ఏర్పాటు చేయబడెను.

### ఆంధ్రగ్రంథాలయము, మిరియాలగూడెం (నైజాం)

7-2-40 వ తేదీ పై గ్రంథాలయములో గాంధీమహాత్ముని ఛాయాపటము స్థానిక వైశ్యయువజన సంఘాధ్యక్షులగు డాక్టరు మాశేమల్ల వెంకటేశ్వరగుప్తగారు బహిర్గతమొనర్చిరి. సభకు పలువురు వర్తక ప్రముఖులువిచ్చేసిరి. గుప్తగారు గాంధీమహాత్ముని ముఖ్యాశయములగు నూలువడకుట, అహింస, ఖద్దరు ధారణ, హరిజనసేవ మున్నగు కార్యములను ప్రతివ్యక్తియు దీక్షతో ఆచరించుట ధర్మమనిచెప్పిరి.

## శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, హైదరాబాదు

పై గ్రంథాలయము పక్షమున 17-2-40వ తేదీ మొదలు మహాకవి బమ్మెర పోతనామాత్యుని వర్ధంత్యుత్సవములు వారముదినములు మహా వైభవముతో జరుపబడెను.

ఇందు మొదటిదినం కార్యక్రమానికి శ్రీకోదండరామిరెడ్డిగారధ్యక్షత వహించిరి. డాక్టరు చిలుకూరి నారాయణరావు, ఎం. ఏ, పిహెచ్. డి. గారీకార్యక్రమమును ప్రారంభించుచు పోతనగారి ప్రతిభ నుగ్గడించుచు మహోపన్యాసమును గావించిరి.

రెండవనాడు శ్రీ నారాయణరావుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు పోతనకాల చరిత్రను గూర్చి ఉపన్యసించిరి. ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు 'పోతనామాత్యుని కవిత'యను విషయమును గూర్చి ప్రసంగించిరి. విద్వాన్ గరికపాటి లక్ష్మీకాంత శాస్త్రి, బి. ఏ., గారిచే సభాంతమున 'రుక్మిణీ కల్యాణము' భాగవత కాలక్షేపముగావింపబడెను.

మూడవరోజు సాయంత్రం 4 గంటలకు స్త్రీలకై ప్రత్యేక సమావేశ మేర్పాటుచేయబడెను. 5 గంటలకు మరల జరిగిన బహిరంగసభలో 'ఆంధ్రుల ప్రాచీన కళావైభవము'ను గూర్చి శ్రీ దశిక సుబ్బరాయ శర్మగారును, 'పోతన సమకాలిక కవుల'ను గూర్చి శ్రీ సి. హెచ్. రంగాచార్యులుగారును, 'భాగవత భాషాంతరీకరణము'ను గూర్చి శ్రీ తూములూరి కృష్ణమూర్తిశాస్త్రిగారును ఉపన్యసించిరి. పిమ్మట స్త్రీ పురుషులకు భాగవతమునందలి నియమిత పద్యములలో పోటీలు జరిగెను. స్త్రీల పోటీయందు పాల్గొనినవారి కందరకు డాక్టరు నారాయణరావుగారు తమ పుస్తకముల బహూకరించుటకు వాగ్దత్తముచేసిరి.

'పరిశోధనదినము'గ పరిగణింపబడిన నాలవనాటి కార్యక్రమమునకు ఆచార్య రాయప్రోలు వెంకటరామసోమయాజులుగా రధ్యక్షతవహించిరి. నాటిసభలో 'ఆంధ్రభాషాతత్త్వము'ను గూర్చి శ్రీ బిదురు వెంకటశేషయ్యగారును, 'ఆంధ్రచారిత్రక పరిశోధన'ను గూర్చి ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్యగారును 'ఆంధ్రలిపి చరిత్ర'ను గూర్చి శ్రీ ఋస్. వి. దీక్షితులుగారును ఉపన్యసించిరి. రాత్రి జంగముకథా కాలక్షేపముతో నాటి కార్యక్రమము ముగిసెను.

'ప్రకృతి శాస్త్రముల'కు సంబంధించిన అయిదవనాటి ఉత్సవము నిజాం కళాశాలలో ప్రొఫెసరుగనున్న డాక్టరు కామేశ్వరరావుగారి ఆధ్వర్యమున నిర్వహింపబడెను. నాటి సభలో 'ఆనువంశిక సిద్ధాంతమ'ను విషయముపై శ్రీ బి. వి. రమణరావుగారును 'విశ్వనిర్మాణము'ను గూర్చి శ్రీ వేంకటాచార్యులు ఎం. ఏ. గారును 'సూర్యకుటుంబము'ను గూర్చి శ్రీ రావాడ సత్యనారాయణగారును ప్రసంగించిరి. కడపటి ఇద్దరుపన్యాసకులు తాము చెప్పు విషయములను యక్షిణీదీప సహాయముతో ఉదాహరణ పూర్వకముగ వివరించిరి.

ఈవర్ధంత్యుత్సవములో నారవదినము స్త్రీలకై ప్రత్యేకింపబడెను. నాటి సభకు శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవిగారధ్యక్షత వహించిరి. శ్రీమతులు సీతాకుమారి, నడింపల్లి సుందరమ్మ వగైరాలు వివిధ విషయములపై ఉపన్యసించిరి. 'పోతన స్త్రీ పాత్రల'నుగూర్చి శ్రీమతి భారత రత్నాకరాంబగారి ఉపన్యాసము చాలగ సభ్యుల నాకర్షించెను. విద్వాన్ శ్యామరావుగారి హరికథా కాలక్షేపముతో నాటి సభ ముగిసెను.

ఆఖరుదినం కార్యక్రమం చాల ఆహ్లాదకరముగ నుండెను. 'ఆంధ్రసంస్థలు, వార్తా పత్రికల' దినముగ పరిగణింపబడిన నాటి ఉదయము సభకు గోల్కొండ పత్రికా సంపాదకులగు శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారధ్యక్షులుగ నుండిరి. అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసమున ఆంధ్రులు తమ పత్రికల యెడ జూపు నిరాదరణకు విచారమును వెలిబుచ్చిరి. శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు నిజాం

రాష్ట్రమందలి ఆంధ్రోద్యమునుగూర్చి ముచ్చటించుచు నిజాంరాష్ట్రాంధ్రుల అభివృద్ధికై శ్రీ మాడపాటి హనుమంతరావుగారు చేసిన కృషిని వివరించిరి. శ్రీ బి. రామానుజాచారిగారు 'భారతీయ వార్తా పత్రికల'ను విషయముపైనను శ్రీ పి. వి. సుబ్బారాయుడుగారు 'ఆంధ్రులు-వార్తా పత్రికల'ను విషయమును గూర్చియు శ్రీ ఇల్లిందల సీతారామారావుగారు 'గ్రంథాలయోద్యమము - ఆధునిక గ్రంథాలయ పద్ధతుల పైనను మాట్లాడిరి. అనంతరం హైదరాబాదు నందలి కొన్ని ఆంధ్ర సంస్థల నివేదికలు చదువబడెను.

నాటి సాయంకాలము రెడ్డి విద్యార్థివసతి గృహమందు బహుమాన ప్రదానోత్సవము శ్రీ ప్రతాప రెడ్డిగారిచే గావింపబడెను. అనంతరం మాకి రంగాచారిగారు వ్రాసిన 'పోతన' నాటకము ప్రదర్శింపబడెను. మధ్యమధ్య సువాసం సత్యనారాయణగారి భరతనాట్యం ప్రదర్శనము సభ్యులను చాలగ రంజింపజేసెను.

## శ్రీవిజ్ఞాన నికేతనము, ఖమ్మంమెంట్టు (నైజాం)

పై గ్రంథాలయము యొక్క వార్షికోత్సవము 29-2-40, 1-3-40 తేదీలలో 'విభూతి' పత్రికా సంపాదకులును, వేదకావ్యస్మృతి తీర్థులును నగు బ్రహ్మశ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారి అధ్యక్షతను అత్యంతవైభవముగ జరిగెను. పండితకవులగు శ్రీ గవ్వా అమృతరెడ్డిగారు 29-2-40 వ తేదీ సాయంత్రము సభను ప్రారంభించుచు ఉపన్యసించిరి.

## దేశోద్ధారక గ్రంథాలయం, ఢిల్లీ

25-2-40 వ తేదీ సాయంత్రం ఢిల్లీనగరాంధ్రులు కొందరు దక్షిణ ఇండియా కోఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ కార్యాలయంలో డాక్టరు లంక సుందరంగారి అధ్యక్షతను సమావేశమై ఢిల్లీనగరంలో శ్రీదేశోద్ధారక, విశ్వదాత, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి స్మృతి చిహ్నంగా ఒక ఆంధ్రగ్రంథాలయం స్థాపించడానికి నిశ్చయించారు.

దీని తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీకపిల కాశీపతిగారు "...ఆంధ్రోద్యమానికి అంకురం ఆంధ్ర గ్రంథాలయోద్యమం. సాంప్రదాయాను సారంగా ఢిల్లీలో ఆంధ్రోద్యమం, ఒక ఆంధ్రగ్రంథాలయపు స్థాపనతో ప్రారంభిస్తే చాలా మంచిది. గ్రంథాలయానికి ఒకపేరు వెతుక్కోనక్కరలేకుండా నాయెదురుగా దేశోద్ధారకుని చిత్రపటం కనబడుతుంది..." అని చెప్పినారు.

సభ్యులు చాలమంది వెంటనే విరాళాలిచ్చారు. శ్రీరావు సాహెబు కె. వి. అప్పయ్యపంతులుగారు ఒక బీరువా వాగ్దానంచేశారు. గ్రంథాలయ స్థాపనకు దోహదంచేయుటకై డాక్టరు లంక సుందరంగారిని, ఆంధ్రదేశములో ప్రచారంచేసి గ్రంథాలు, చందాలు పోగుచెయ్యడానికి శ్రీ కాశీపతిగారిని సభ్యులు నియమించారు.

## బొంబాయి తెలుగుగ్రంథాలయం

1939 సం॥ డిసెంబరు నెల కడపటి బుధవారం రోజున బొంబాయి కామాటిపురమందు గల తెలుగు ఉచితగ్రంథాలయపు 64 వ వార్షికోత్సవము బొంబాయి నగరమునకు మేయరుగనున్న శ్రీ. బి. యన్. కరాంజియా గారి అధ్యక్షతను అత్యంత వైభవముగ జరిగెను. ఈ ఉత్సవములో బి. జి. ఖేరు, మొరార్జిదేశాయి, టి. ప్రకాశం పంతులు, మధురదాసుత్రికంజీ మున్నగు ప్రముఖులు పాల్గొనిరి.

గ్రంథాలయాధ్యక్షులగు యస్. యల్. శీలంగారు తమ గ్రంథాలయము జాతిమతవిభేదములు లేక అందరిని రానిచ్చుచున్నదనియు, సంస్థకు 112 మంది సభ్యులు కలగనియు తెలిపిరి. ప్రకాశం పంతులుగారు తెలుగువారు బొంబాయిలో 60 యేండ్లనుండి ఉచితగ్రంథాలయమును నడపుచుండుట తనకు చాల సంతోషముగనున్నదని చెప్పిరి. శ్రీ యన్. సి. నరసింహాచార్యాగారు తెలుగు పనివారలు,

వారికుటుంబములు నివసించే నైగాం, పరేల్ వొర్లి ప్రాంతములందు యింకా యిట్టి తెలుగు గ్రంథాలయముల నెక్కువగ స్థాపించి, పిల్లలచదువుకై పగలు, రాత్రికూడ పాఠశాలలను సాగించుటవసరమనియు, ఈగ్రంథాలయమునకు మునిసిపాలిటీవారు సాలుకు కనీసము రు 500-0-0 విరాళము నిచ్చుటవసరమనియు మున్నగు సంగతులనుపన్యసించిరి. బొంబాయి మాజీప్రధాని బి. జి. ఖేరుగారుపన్యసించిన పిమ్మట మధురదాసుత్రికంజీగారు గ్రంథాలయట్రస్టీలను దానినిర్వహణను చక్కగ చేయుచున్నందుల కభినందించుటతోను, వందన సమర్పణముతోను సభ సమాప్తమయ్యెను.

## ఆంధ్రజనసంఘ గ్రంథాలయము, కల్యాణి

కల్యాణి ఆంధ్రజనసంఘ గ్రంథాలయం ద్వాదశవార్షికసభ 28-1-40 వ తేదీ మధ్యాహ్నము కల్యాణి పురపాలకసభాభవనమున సంఘాధ్యక్షులైన శ్రీ ప్రతాపగిరి రామమూర్తిగారి అధ్యక్షతను జరుపబడెను.

దైవప్రార్థనానంతరము రావుబహద్దూర్ డి. సారంగపాణినాయుడుగారు ప్రారంభోపన్యాసము నిచ్చుచు సంఘోద్ధరణ, వాఙ్మయాభివృద్ధి మున్నగు ప్రయోజనముల నొసంగు గ్రంథాలయముల స్థాపించుకొని రాష్ట్రేతరములందుగల ఆంధ్రులు వ్యక్తిత్వము, భాషాభివృద్ధి, సంఘీభావముల పెంపొందించుకొనుట అవసరమని నుడివిరి.

అధ్యక్షులు పండ్రెండు సంవత్సరములుగ తమ సంఘము ఏలాటి కలహములులేక సంఘీభావముతో పనిచేసి ఇతరసంస్థలకు ఆదర్శప్రాయముగ నుండుటకు తాము గర్వపడుచున్నట్లు చెప్పిరి. కార్యదర్శి గతసంవత్సర నివేదికను సభ్యులకు చదివి వినిపించిన పిమ్మట నూతన సంవత్సరమునకు క్రిందివిధముగ ఎన్నికలు జరిగెను.

రావుబహదూర్ డి. సారంగపాణినాయుడుగారు—అధ్యక్షులు

శ్రీ మండ రామమూర్తిగారు—ఉపాధ్యక్షులు

శ్రీ వాయువేగుల వెంకటసుబ్బారావుగారు—కార్యదర్శి

శ్రీ గూళ్యం లక్ష్మీకాంతంగారు—సహాయ కార్యదర్శి

శ్రీ దేవయ్య, శ్రీ కస్తూరి అచ్యుతరామయ్య, శ్రీ ఎన్. వైద్యనాథముగార్లు కమిటీ సభ్యులు.

చివరకు శ్రీ మండరామమూర్తిగారి ప్రతిపాదనపై కల్యాణినగర ఆంధ్రజనసంఘ గ్రంథాలయముల యాజమాన్యమున త్వరలో ద్వితీయ రాష్ట్రేతర ఆంధ్రగ్రంథాలయ మహాసభను జరుపుటకు తీర్మానించబడెను.

---

# భారత గ్రంథాలయోద్యమము

## అఖిల భారత గ్రంథాలయ మహాసభ, పాట్నా

13–4–40 వ తేదీ ఉదయం పాట్నాలో ప్రారంభమైన నాల్గవ భారత గ్రంథాలయ మహాసభకు భారత ప్రభుత్వపు విద్యా కమీషనరు జాన్ సార్జెంటుగారధ్యక్షతవహించిరి. పాట్నా హైకోర్టు ప్రధానన్యాయమూర్తి, సర్ ఏ. టి. హారిస్‌గారు సభను ప్రారంభించుచు అక్షరాస్యతా ప్రచార ప్రయత్నముల గురించి ఇట్లుచెప్పిరి. నిరక్షరులను అక్షరాస్యులుగానొనర్చుట ప్రశస్తమైనను, అక్షరాస్యులనుకూడ మరచిపోకూడదు. అక్షరాస్యులైనవారికి తగు ఏర్పాట్లు చేయకున్నచో అక్షరాస్యతా ప్రచారముయొక్క అసలు ప్రయోజనమే విఫలమగును. ప్రపంచమునందు మరియే యితరదేశముకన్న ఇండియాలో గ్రంథాలయములు ఎక్కువ అవసరమనుట స్పష్టమే. ప్రజాసామాన్యమును, ముఖ్యముగా విద్యార్థులు పేదవారుగా నుండుటవల్ల వారు ఆత్మవికాసముకొరకు గ్రంథములను కొనలేకున్నారు.

హారిస్‌గారు సభను ప్రారంభించిన పిమ్మట ఆహ్వాన సంఘాధ్యక్షులగు డాక్టరు సచ్చిదానంద సిన్హాగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. వీరి స్వాగతోపన్యాసమున పాట్నానగర ప్రాముఖ్యమును ప్రస్తావించుటతోపాటు అచ్చటి రెండు ముఖ్యసంస్థలు ప్రత్యేకముగ పేర్కొనబడెను. ఇందు మొదటిది ఖుదాబక్షుప్రాచ్య గ్రంథాలయము. దీనియందపూర్వమైన అరబిక్, పర్షియన్ వ్రాతప్రతులున్నవి. రెండవది పాట్నామ్యూజియం. తరుపరి మాజీ విద్యామంత్రి సయ్యదు మహమ్మదుగారు బీహారు రాష్ట్రములో సాగించిన అక్షరాస్యతా ప్రచారసమాచారములను తెలుపుచు $2\frac{1}{2}$ సంవత్సరములలో అచ్చట ప్రభుత్వమువారు సుమారు 4000 గ్రామ గ్రంథాలయములను స్థాపించగలిగిరనియు, అక్షరములు నేర్చుకొన్నవారు తిరిగి వాటిని మరచిపోకుండ జేయుటకే ఇవి ప్రారంభింపబడెననియు, వయోజన విద్యాభివృద్ధికి సాయపడు అనేకవిషయములనుగూర్చిన చిన్నగ్రంథములు 100 ప్రత్యేకముగ తయారుచేయబడి పై గ్రంథాలయములలో నుంచబడినవనియు వీరు చెప్పిరి.

### అధ్యక్షోపన్యాసము

అధ్యక్షులు 'పారంపర్యమైనా సంపాదితమైనా జ్ఞానమును ప్రచారమొనర్చుటకు గ్రంథములు అవసరము. వర్తమాన కాలములో జ్ఞానప్రసారమున పుస్తక వినియోగమును తృణీకరింపవీలులేదు' అని చెప్పి పాఠశాల, కళాశాలల గ్రంథాలయములలో ఏలాటి గ్రంథములుండవలయునో, వాటికెంత సహాయము కావలెనో తెలిపిరి. విద్యావ్యాప్తికి కేంద్ర, ప్రాంతీయ గ్రంథాలయ విధానము నొక దానినివారు సూచించిరి. అన్ని దేశముల నలుమూలల ప్రాంతీయ గ్రంథాలయములేర్పడి వీటియన్నిటిపైన వీనియందు లభించని గ్రంథములుగల కేంద్ర జాతీయ గ్రంథాలయ మొకటి స్థాపింపబడవలెనని చెప్పిరి. మరియు పుస్తకములవిలువ, ప్రయోజనము తెలిసినవారు గ్రంథాలయములను నడపిన తప్పపై పద్ధతి ఫలవంతము కాజాలదనిరి. గ్రంథపట్టికల తయారు చేయుట, పుస్తకముల వర్గీకరించి క్రమముగ పేర్చుట శాస్త్రీయముగ తెలిసి తన నిక్షేపములను వెదుకవచ్చినవారికి మార్గదర్శి, మిత్రుడుగనుండు భాండాగారులు అవసరమని చెప్పి వారివిధులను క్రింది విధముగ తెలిపిరి. 'గ్రంథభాండాగారి ఉత్తమగ్రంథములతో పరిచయము గలిగి వానిని ప్రేమించువాడుగ నుండవలెను. వాని పట్టీని వ్రాసి రక్షించుటతో సతడు తృప్తిచెందరాదు. అతనిపని చాలముఖ్యమైనది. అందువలన అతడు నాగరికుడుగను, గొప్పయోగ్యత గలవాడుగను నుండవలెనని కోరుట అన్యాయముకాదు. సాధారణ విద్యాబిరుదములను పరిపూర్ణ మొనర్చుటకు అతడు గ్రంథాలయశాస్త్రమును చదివి ఇందుపట్టమును బడయుటకు అవకాశముండవలెను.

## గ్రంథాలయ ప్రదర్శనము

ఈమహాసభయొక్క ఉదయకాలసమావేశము ప్రదర్శన ప్రారంభముతో ముగిసినది. ఇందుగ్రాత ప్రతులు, అపురూపగ్రంథములు, భారతదేశపు ఆధునికపుస్తకములు, గ్రంథాలయములకు వలయు పరికరములు, గ్రంథాలయ పత్రికలు, గ్రంథాలయ శాస్త్రసంబంధమగు గ్రంథములు ప్రదర్శింపబడినవి. ఈ ప్రదర్శనమునకు వచ్చిన వస్తువులలో చాల భాగము పాట్నాయందలి వివిధ సంస్థలకు చెందినవి. పాట్నా స్కూల్ ఆఫ్ ఆర్ట్సువారు బీహారు ఔన్నత్యమును సూచించు చిత్తరువులను; అర్రాయందలి జైనుల ప్రాచ్య గ్రంథాలయమువారు 300 యేండ్లనాటి జైనరామాయణమును, తాటియాకులమీదను చిన్ని చిన్ని కొయ్యముక్కలమీదను వ్రాయబడిన మరికొన్ని పొత్తములను; మహేశ్వర పౌర గ్రంథాలయమువారు 1691 సం॥ లో అచ్చైన 'గణితవిచిత్రములు' అనే గ్రంథమును, అకారాదిగా అంటించబడిన వార్తా పత్రికలలోని వ్యాసములను, 1000 పేజీల చిన్ని భగవద్గీతను ప్రదర్శనమునకు తీసికొనివచ్చిరి. ఇవిగాక 13 వ శతాబ్దములో అరబిక్ భాషలో వ్రాయబడిన క్షేత్ర గణిత సంబంధమగు పుస్తకము; 1799 సం. శరణ్ దివానుగనున్న నాజిర్ ఆలీ ఆధీనమందున్న 'చిత్తరువులు వ్రాయుట – బొమ్మలకు సంబంధించిన' గ్రంథముల పట్టీ; 18 వ శతాబ్దమునాటి హిందూ ముస్లిముల సాంఘిక జీవనమును గూర్చిన సూచనలుగల 'షా అయతుల్లా' రచించిన ఉర్దూ పద్యకావ్యము; 1375 వ సం॥ లో బయలుదేరిన సారస్వత, చారిత్రక విషయములతో కూడిన 'కాశీపత్రిక'; 75 పేజీలలో సుందరముగ లిఖింపబడిన 'కురాను'; 1000 సం॥ లకు పూర్వమునాటి 'కృష్ణతత్వము'ను సంస్కృత గ్రంథము; గుడ్డలపై నల్లికకుట్టు కుట్టిన దావూదుఖానుని దండయాత్రకు సంబంధించిన చిత్తరువులు; లాహోరునందలి మెహరా కంపెనీవారి గ్రంథాలయ పరికరములు; బీహారు రాష్ట్రగ్రంథాలయ సంఘమువారి "పిల్లల గ్రంథాలయములను గూర్చిన ప్రణాళికలు" ఈ ప్రదర్శనమందలి వస్తువులలో పేర్కొనదగినవి.

13 వ తేది సాయంత్రము 14, 15 తేదీలందు ప్రముఖులగు గ్రంథ భాండాగారులచే వివిధ విధములగు గ్రంథాలయ సమస్యలపై వ్యాసములు చదువబడి ఒక్కొక్క వ్యాసములోని విషయముపై చర్చలు జరిగెను.

## తీర్మానములు

ఈ మహాసభలో గావింపబడిన తీర్మానములలో క్రిందివి ముఖ్యమైనవి.

1. విశ్వవిద్యాలయ గ్రంథాలయములలో గౌరవగ్రంథ భాండాగారులు, దినములో కొంతకాలము మాత్రి మీపనికి నియోగింపబడువారు లేకుండ దినమంతయు గ్రంథాలయములో పనిచేయు భాండాగారులను వేతనముపై నియమించుపద్ధతి నమలులోనికి తెచ్చుటకై అంతర్విశ్వవిద్యాలయ సంఘముద్వారా అట్టి విశ్వవిద్యాలయములను కోరుట.
2. కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములను, స్వదేశసంస్థానముల వారిని గ్రంథాలయాలు స్థాపించి, పోషించుచు ప్రజానీకమునకు విజ్ఞానము సులభముగ లభించుటకై గ్రంథాలయశాఖల నేర్పఱచి, వారు తమ యధీనముననుండు గ్రంథాలయములను వీలైనంతవరకు ప్రజాసామాన్యమున కందుబాటులో నుంచుటకై అర్థించుట.
3. భారతగ్రంథాలయ సంఘమువారు గ్రంథభాండాగారుల కవసరమైన సమస్తవిషయములను గూర్చిన వివరముల సేకరించి కోరినవారికి సమాచారముల తెలియజేయుటకు తీర్మానించుచు, గ్రంథభాండాగారు లెవ్వరుగాని గ్రంథాలయ విధానమున తమకు తెలియవచ్చు నూతనాంశములను సమాచార కేంద్రమునకు తెలిపి సహకార మొనర్చవలసినదిగ కోరుట.

4. కనీసము రాష్ట్రీయ కేంద్రములందైన ధర్మగ్రంథాలయములను స్థాపించుటకుగల అవకాశములను గూర్చి ఆలోచించుటకుగాను ఉపసంఘమొకదాని నేర్పాటుచేసి ధర్మగ్రంథాలయోద్యమ వ్యాప్తికి దోహదము నిచ్చు మాదిరి భారత గ్రంథాలయ చట్టమును తయారుచేయుటకీ సంఘమున కధికారమిచ్చుట.

5. భారత గ్రంథాలయ సంఘపక్షమున త్రైమాసిక పత్రిక యొకటి ఉండుట చాల అవసరమనియు ఇందుకుగాను 'మోడరన్ లైబ్రేరియన్' పత్రికయొక్క యాజమాన్యము నీ సంఘము తీసికొనుటకు వీలున్న విచారించి, లేని పక్షమున వేరుగ నొక పత్రికను ప్రారంభించు ప్రయత్నములో నుండుట.

6. వివిధరాష్ట్రీయ ప్రభుత్వములు, రాష్ట్రీయ గ్రంథాలయ సంఘములు తమ తమ రాష్ట్రములందలి గ్రంథాలయ పరిస్థితుల పరిగణనము చేయుటకును, అట్టి ప్రయత్న మిదివరకేయున్న నీపనిని త్వరలో ముగించుటకును, ఏ ప్రభుత్వముగాని తామే స్వయముగ నీ పనిని నిర్వహించ జాలనప్పుడు దీనిని నిర్వహించు గ్రంథాలయ సంఘమునకు ఆర్థికముగ తోడ్పడుటకును కోరుట.

7. భారతదేశమందలి వివిధరాష్ట్రముల మధ్య సుహృద్భావమును పెంపొందించు నిమిత్తము ఇతర భాషలలోనికి అనువదింపబడుటకు ఉపయుక్తముగ నుండదగిన మనదేశమందలి వేరు వేరు భాషలలో ప్రకటింపబడిన గ్రంథముల పట్టీలను సిద్ధముచేయుటకై తీర్మానించుట.

---

## టెహారను జాతీయ గ్రంథాలయము

22-6-40 వ తేదీ టెహారనులో జాతీయ గ్రంథాలయము & పఠనమందిరము స్థాపింపబడినది. పాశ్చాత్యదేశములలో ఆధునిక పద్ధతుల ననుసరించి నిర్మింపబడుచున్న గ్రంథాలయ భవనములవలెనే ఈభవనము నిర్మింపబడినది. గ్రంథాలయమున 31,576 గ్రంథములున్నవి. పఠనమందిరమునకు దాదాపు 100 పత్రికలు వచ్చుచున్నవి.

## బొంబాయిలో కేంద్ర గ్రంథాలయం

1940 సం॥ ఏప్రిల్ మాసాంతమున బొంబాయి ప్రభుత్వము వారు రాజధాని కంతటికిని బొంబాయిలో కేంద్ర గ్రంథాలయం స్థాపించుటకును పూనా, అహమ్మదాబాదు, ధార్వారు పట్టణములలో ప్రాంతీయ గ్రంథాలయముల నేర్పాటుచేయుటకును ఆలోచనచేసిరి. ప్రజలలో విద్యావ్యాప్తిని గావించుటకు మంత్రివర్గము వారు చేసిన కృషికి ఈగ్రంథాలయముల యేర్పాటు చాల తోడ్పడునని ప్రభుత్వంవారి సంకల్పము. నూత్న గ్రంథాలయ నిర్మాణమును గురించి విచారణచేయుటకు ఒకకమిటీని వారు నియమించినారు. దీనికి గవర్నమెంటు లా కాలేజీ ప్రిన్సిపాలగు ఎ. ఎ. ఎ. ఫైజీగారిని అధ్యక్షులుగ ఏర్పాటుచేసినారు. కేంద్ర ప్రాంతీయ గ్రంథాలయములకు ఇతరగ్రంథాలయములకు ఉండవలసిన సంబంధమును గూర్చియు, రాజధానిలోని వివిధ భాషాప్రదేశముల అవసరములగురించియు ఈ కమిటీ విచారణచేయగలదు. ఈ కమిటీవారు జారీచేసిన ప్రశ్నావళిలో బొంబాయి యందున్న రాయల్ ఏసియాటిక్ సొసైటీవారి గ్రంథాలయమును బొంబాయి కేంద్రగ్రంథాలయంగా పరిగణించే విషయమై కూడ కలదు.

# నివేదికలు

## మద్రాసు గ్రంథాలయ సంఘము

### 12 వ వార్షిక నివేదిక సంగ్రహము

1-2-39 వ తేదీ నుండి 31-1-40 వ తేదీ వరకు జరిగిన కార్యక్రమమిందు వివరింపబడినది.

**సభ్యులు :** నివేదిక కాలమున సంఘ సభ్యుల సంఖ్య 602. ఇందు అభిమానులు (Patrons) 2; సహాయులు 40; శాశ్వతసభ్యులు 294; సంస్థలు 78; సాధారణ సభ్యులు 294.

**కార్యక్రమ ప్రారంభము :** నూతన సంవత్సర కార్యక్రమ ప్రారంభోత్సవము 3-4-39 వ తేదీ మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులగు సర్. లయనల్ లీచ్ గారి ఆధ్వర్యమున జరిగెను. సర్. టి. ఆర్. వేంకట్రామశాస్త్రి సి. ఐ. ఇ. గారు ప్రారంభోపన్యాసము నిచ్చిరి.

**ప్రచారము వగైరా :** నివేదిక కాలములో సంఘపక్షమున 30 ఉపన్యాసములు గ్రంథాలయోద్యమమును గూర్చియు, జనసామాన్యముయొక్క చదువును గురించియు, మద్రాసు పౌర గ్రంథాలయ చట్టమును గూర్చియు నీయబడెను. 1-9-39 వ తేదీనుండి 14-9-39 వ తేదీవరకు యస్. యమ్. ఫాసిల్ గారు దక్షిణ ఆర్కాటు జిల్లాలో తిరిగి ప్రచారముచేసిరి.

ఈ సంఘసభ్యులచే వ్రాయబడిన వ్యాసములు 14 ఆంధ్రగ్రంథాలయం, మాడరన్ లైబ్రేరియన్ మున్నగు పత్రికలలో ప్రకటింపబడెను.

**ప్రచురణలు :** శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారి సలహాపై గ్రామీణుల ఉపయోగం నిమిత్తం 9 ముఖ్యవిషయములనుగూర్చి తమిళములో చిన్నపుస్తకమును ప్రకటించుటకై నిశ్చయించి దీనిని తయారుచేయునిమిత్త మొక సంపాదకీయవర్గ మేర్పాటు చేయబడెను. 'విద్యుచ్ఛక్తి మహిమలు'ను గూర్చిన గ్రంథము నొకదానిని ప్రచురించుటకుకూడ నేర్పాటులు జరిగెను. ఈ సంఘముయొక్క 8 వ ప్రచురణగా యస్. ఆర్. రంగనాథన్ గారి 'కోలన్ క్లాసిఫికేషన్' ద్వితీయముద్రణము 1939 జులై నెలలో ప్రచురింపబడెను. నివేదికకాలములో నూతనముగ 'మెమోయర్స్ ఆఫ్ ది మెడ్రాసు లైబ్రరీ అసోసియేషన్' అను చిరుపొత్త మొకటి వెలువరింపబడినది. తమిళవాఙ్మయసూచికను తయారు చేయుటకై చాలకాలముగ నీసంఘము పనిచేయుచు, ఇప్పటికి 33,920 గ్రంథముల వివరములను సేకరించినది.

**ఇతర సంఘములతో సంబంధము :** ఈసంఘము భారతగ్రంథాలయ సంఘమునకు అనుబంధ సంస్థగనుండి దానియందు సభ్యత్వమును గలిగియున్నది.

**సలహాలు :** మధుర జిల్లాబోర్డువారికి సంచారగ్రంథాలయ విధాన ప్రారంభ కార్యమునను, హిందూస్థానీ తాలిమిసంఘము, సేవాగ్రామమువారికి శాస్త్రగ్రంథములకు కేటలాగులు వ్రాసికొను పద్ధతిని తెలుపుటలోను, పుదుక్కోటు టౌన్ బ్యాంకువారికి ఆంగ్లపుస్తకములపట్టీని పంపుటయందును ఈసంఘము తోడ్పడెను.

**సమావేశములు :** నివేదిక కాలములో ఈ సంఘ సాధారణసమావేశ మొక పర్యాయమును పాలకవర్గము 3 పర్యాయములు కూడినవి. 31-3-39 వ తేదీ జరిగిన సాధారణసభలో 'గ్రంథాలయములకు, వయోజనవిద్యాప్రచారమునకు విరివిగ విరాళముల నొసగున ట్లేర్పాటు చేయవలసినది'గ ప్రభుత్వము

కోరబడెను. తమిళ్ వాఙ్మయ సూచికను తయారుచేయుటకై రు 2000/- లు విరాళమిచ్చిన చెట్టినాడు కుమార రాజా యమ్. యే. ముత్తయ్య చెట్టియారుకు కృతజ్ఞత తెలుపబడెను.

ఆదాయవ్యయములు

| జమలు రు. అ. పై. | | ఖర్చులు | రు. అ. పై. |
|---|---|---|---|
| 9499-13- 3 | ప్రారంభనిల్వ | ఆఫీసునిర్వహణ, సాదరు | 231- 4-0 |
| 354- 0- 0 | చందాలు, విరాళములు | అద్దె | 180- 0-0 |
| 327- 9-11 | మూలనిధిపై వడ్డీ | పోస్టేజీ | 146-12-0 |
| 220- 0- 0 | పి. ఒ. క్యాష్‌సర్టిఫికెట్టులపై లాభము | నివేదిక, సమావేశాలు | 167-15-0 |
| | | ప్రచారపు ప్రయాణం | 92- 1-0 |
| 1121- 3-11 | పుస్తకాల అమ్మకం | స్టేషనరీ, సామాను | 41- 6-0 |
| | | ప్రచురణ కాతా | 1720- 0-6 |
| | | ఇతరసంఘములకు చందాలు | 20- 0-0 |
| | | అంత్యనిల్వ | 8923- 4-7 |
| 11522-11- 1 | | మొత్తము | 11522-11-1 |

## ఇంపీరియల్ లైబ్రరీ : కలకత్తా

### 1938-39 సం॥ నివేదిక

భారతదేశ జాతీయ గ్రంథాలయ మనదగు కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీయొక్క 1938-39 సం॥ నివేదిక 1940 సం॥ లో ప్రకటింపబడినది. ఈ సంవత్సరములో 11,109 గ్రంథములు ఇండ్లకు తీయబడినవి. గ్రంథాలయమునకు నిత్యము చదువుకొనుటకు వచ్చినవారి సగటు సంఖ్య 206. దీనికి ముందు సం॥ లో 190 మంది మాత్రము సగటున గ్రంథాలయమునకు వచ్చి చదువుకొనుచుండిరి. నివేదిక కాలములో గ్రంథాలయమునకు నూతనముగ చేర్చబడిన 10,070 గ్రంథములలో 3,462 గ్రంథములు గ్రంథాలయమునకు దానము చేయబడినవి. గ్రంథపాఠకులు క్రిందివరుస ప్రకారము వివిధవిషయములలో అభిమానమును చూపిరి. (1) వాఙ్మయము (2) చరిత్ర (3) న్యాయశాస్త్రము (4) ఇంజనీరింగు (5) మాస, వారపత్రికలు (6) భూగోళము (7) భూగర్భ శాస్త్రము (8) విద్య (9) జీవితకథలు (10) వైద్యగ్రంథములు. కేంద్ర, రాష్ట్రీయ, విదేశ ప్రభుత్వ ప్రకటనలు 7,090 గ్రంథాలయమునకు తెప్పించబడెను.

## శ్రీ వీరేశలింగకవిసమాజ గ్రంథాలయము : కుముదవల్లి

పై గ్రంథాలయముయొక్క 42 వ వార్షికనివేదిక మాకు చేరినది. 22-6-1897 వ తేదీ స్థాపింపబడిన ఈ గ్రంథాలయము దినదినాభివృద్ధి జెంది ఇప్పటికొక స్వంతభవనముతోను, రు 2600-0-0 మూలనిధితోను, 1739 నానావిధ గ్రంథములతోను విరాజిల్లు చున్నది.

**గ్రంథాలయం సేవ:** నివేదికకాలములో ఈ గ్రంథాలయమునకు 16 దిన, వార, పక్ష, మాసపత్రికలు తెప్పింపబడినవి. గ్రంథాలయమునకు నిత్యమువచ్చు పాఠకుల సగటు హాజరు 21. గ్రంథాలయమున చదువబడిన 65 గ్రంథములు గాక, ఇండ్లకు తీసికొనిపోయి పురుషులు 415 స్త్రీలు 385

గ్రంథముల నివేదిక కాలములో చదివిరి. నివేదిక కాలములో గ్రంథాలయమునకు చేర్చబడిన రు 36-4-3 విలువగల 51 పుస్తకములలో రు 15-1-0 ఖరీదుచేయు 19 పుస్తకము లుచితముగ సంపాదింపబడినవి.

**సమావేశములు:** నివేదిక కాలములో ఈసంఘముయొక్క మహాజనసభలు 13 న్నూ, కార్య నిర్వాహక సభలు 15 న్నూ జరిగినవి.

**ఇతర కార్యక్రమము:** గ్రంథాలయ మూలనిధిలో రు 325-0-0 పై వచ్చు వడ్డీదాతల కోరిక ననుసరించి బీదలకు వస్త్రదానము నిమిత్తము ఏటేట వెచ్చింపబడుచున్నది. ఇదిగాక ప్రతిసంవత్సరము 15-0-0 ఖర్చుపెట్టి ఆయుర్వేదౌషధములను తయారుచేసి గ్రామస్థులకు ఉచితవైద్యసేవ చేయబడుచున్నది. నివేదిక కాలమున 3 మాసములపాటు వయోజనుల నిమిత్తము రాత్రి పాఠశాలయొకటి నడుపబడినది.

## ఆదాయవ్యయములు

| జమ<br>రు అ పై | | | ఖర్చు<br>రు అ పై |
|---|---|---|---|
| 22- 8-6 | ప్రారంభనిల్వ | మూలనిధి డిపాజిట్టు | 100- 0-0 |
| 72- 0-0 | అద్దెలు | సిబ్బంది | 43- 3-0 |
| 127- 8-0 | మూలనిధిపై వడ్డీ | పత్రికలు | 87-11-0 |
| 100- 0-0 | మూలనిధి వసూలు | అప్పుతీర్చినది | 61- 0-0 |
| 40- 6-6 | చందాలు, విరాళాలు | ఇతరబాపతులు | 135- 3-3 |
| 65- 0-0 | అప్పుతీసినది | అంత్యనిల్వ | 20- 3-9 |
| 19-14-0 | పాతపత్రికల అమ్మకం | | |
| 447- 5-0 | | మొత్తము | 447- 5-0 |

# శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము : చిలకలూరిపేట

## 1932-1940 సం॥ కార్యనివేదిక

1932వ సం॥ లో శ్రీ లక్ష్మీనృసింహ సోమయాజి వైశ్య గ్రంథాలయమను పేరుతో స్థాపింపబడి తదుపరి కన్యకాపరమేశ్వరీ వైశ్యగ్రంథాలయమని కొంతకాలము వ్యవహరింపబడినది.

**పరిపాలన:** దీనికి ప్రస్తుతము స్వంతభవనముగాని నిశ్చితమైన నిబంధనలుగాని లేవు 11 మంది సభ్యులొక సంఘముగ నేర్పడి గ్రంథాలయ నిర్వహణ భారమును వహించుచున్నారు. ఈ సంఘమునకు చిలకలూరిపేట వర్తక దిగుమతులమీద రుసుమును చెల్లించుచున్న వర్తక ప్రముఖులందరు గ్రంథాలయ సభ్యులైయున్నారు.

**పుస్తకములు:** నివేదిక కాలములో రు 1250-0-0 విలువగల 1350 పుస్తకములు గ్రంథాలయమునకు చేర్చబడినవి. ఇందు రు 500-0-0 గ్రంథములు మాత్రము ఖరీదుచేయబడినవి.

**పత్రికలు :** నివేదికాంతమునకు గ్రంథాలయమునకు 3 దిన పత్రికలు, 4 వార పత్రికలు, 4 పక్ష పత్రికలు, 12 మాసపత్రికలు, 1 త్రైమాసిక పత్రిక తెప్పించబడుచుండెను. ఇందు ఆంగ్లదినపత్రిక 1, హిందీ మాసపత్రికలు 2 గలవు.

**చదువరులు :** నివేదిక కాలము మొత్తములో గ్రంథాలయమునకు నిత్యము వచ్చినవారి మొత్తము సంఖ్య 55403. చివరి దినములలో వీరిసగటు హాజరు 45. పాఠకులకు ఇండ్లకిచ్చిన గ్రంథములు 14019. పాఠకులలో స్త్రీలు ముగ్గురు మాత్రము 50 గ్రంథములను చదివిరి. క్రిందిఅంకెలు గ్రంథాలయ సేవయందలి అభివృద్ధిని సూచించగలవు. 1939–40 సం॥ లో కలిగిన విశేషమార్పుకు ముఖ్యకారణము ఇచ్చట గ్రంథభాండాగారిగ ప్రస్తుతము పనిచేయుచున్న శ్రీ వంకాయలపాటి శేషావతారంగారి పట్టుదలతో కూడిన పరిశ్రమయే.

| | 1936–37 | 37–38 | 38–39 | 39–40 |
|---|---|---|---|---|
| గ్రంథాలయమునకు వచ్చుపాఠకులు | 7924 | 8678 | 5133 | 16853 |
| ఇండ్లకిచ్చిన పుస్తకములు | 1770 | 1569 | 1001 | 3134 |

**ఇతర కార్యక్రమము :** 1939 - 40 సం॥లో గ్రంథాలయ పక్షమున హిందీపాఠశాల యొకటి నిర్వహింపబడెను. ఇందు 40 మంది విద్యార్థులు చదివిరి.

**ఆస్తి — ఆదాయవ్యయములు :** దీనికి ప్రస్తుతము రు 1100–0–0 విలువగల య 7–16 సెంట్ల భూమిన్నీ, అద్దాలబీరువాలు 6, వ్రాతబల్ల 1 కలవు. వర్తకమహాశయులు చెల్లించుచున్న దిగుమతి సుంకములో సగము గోరక్షణ సంఘమునకు చెందుచున్నది. తక్కినసగము గ్రంథాలయసంఘమునకు చలివేంద్రసంఘమునకు వెచ్చింపబడుచున్నది. గ్రంథాలయ ధనములోనుండి అవసరమైనప్పుడెల్ల గోరక్షణ సంఘమునకు కొంతద్రవ్యము ఈయబడుచున్నది.

## దేశోద్ధారక గ్రంథాలయము : తెనాలి

### ప్రథమవార్షిక నివేదిక

ఇందు 1939 సం॥ మే నెలనుండి 1940 సం॥ ఏప్రిల్ నెలవరకు జరిగిన కార్యక్రమము వివరింపబడినది. 2–6–39వ తేదీ స్థాపింపబడి 15–4–40వ తేదీ యువజనసంఘమునకు అనుబంధముగ చేర్చబడి 1–5–40వ తేదీ శ్రీకృష్ణమోహన గ్రంథాలయముతో కలసి శ్రీకృష్ణమోహన దేశోద్ధారక గ్రంథాలయముగ మారినది.

**పుస్తకములు - పత్రికలు :** వివిధవిషయములకు చెందిన 850 తెలుగుగ్రంథములు, 125 ఆంగ్ల గ్రంథములు గలవు. ఆంధ్రపత్రికతో సహా 6 తెలుగు పత్రికలు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌తో చేరి 6 ఆంగ్లపత్రికలు గ్రంథాలయమునకు వచ్చుచున్నవి.

**చదువరులు :** దినమునకు గ్రంథాలయమునకువచ్చు పాఠకుల సగటు హాజరు 20. సంవత్సరము మొత్తముమీద ఇండ్లకు గొంపోబడిన పుస్తకములు 3203.

**ఇతర కార్యక్రమము :** గ్రంథాలయమున కనుబంధముగ 'తెలుగుజ్యోతి' అను సచిత్రలిఖితపత్రిక సంచికలు నివేదికకాలములో 20 వెలువడినవి. దీనికి శ్రీ రాచకుళ్ళ సుబ్బారావుగారు సంపాదకులుగ నున్నారు.

ఆదాయము రు 33–5–0; వ్యయము రు 31–14–0.

# వయోజన విద్యాప్రచారము

### బీహారు ప్రభుత్వము - వారపత్రిక నిర్వహణం

గ్రామస్థులకు యుద్ధసమాచారములను గూర్చి సక్రమమైన భోగట్టా నిచ్చేనిమిత్తం బీహారు ప్రభుత్వం వారు 'దేహాత్' అను పేరుతో ఒకవార పత్రికను హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ, ఉరుదు భాషలలో 2 సంవత్సరముల పాటు ప్రకటించుటకు నిశ్చయించుకొని ఇందు నిమిత్తం 1 లక్షరూపాయలు బడ్జెటులో ఏర్పాటు చేసికొన్నట్లు 1940 సంవత్సరారంభమున పత్రికలలో ప్రకటింపబడెను.

### అలహాబాదులో అక్షరాస్యతా ప్రచారము

4-2-40 వ తేదీ సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వము వారిచే నేర్పాటుచేయబడిన అక్షరాస్య ప్రచారోత్సవము అలహాబాదులో అత్యంతజయప్రదముగ జరుపబడెను. ఉదయం నగరమందలి వివిధ విద్యాసంస్థలచే భేరీఉత్సవం, మధ్యాహ్నం ఊరేగింపులు యేర్పాటుచేయబడెను. ఈఊరేగింపులు 100 గ్రామములలో జరుపుటకు సన్నాహములు గావింపబడెను. నైనిఅగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటు, అలహాబాదు యూనివర్సిటీవారు గూడ దీనికి ప్రత్యేకపు టేర్పాటులజేసిరి.

పండిత మదనమోహనమాలవ్యా, డాక్టరు రాజేంద్రప్రసాద్, పండిత గోవిందవల్లభపంతు, శ్రీమతి విజయలక్ష్మి, పురుషోత్తమదాసుటాండన్ మున్నగు దేశనాయకులు స్థానిక విద్యాప్రచారకులకు ఉత్సవములు జయప్రదముగ జరుగునట్లాశీర్వదించుచు సందేశములనంపిరి. ఈ సందర్భమున శ్రీనారాయణ చతుర్వేదిగారొక కరపత్రమును ప్రకటించిరి.

### వయోజన విద్యాప్రచారము, మోపర్రు (తెనాలితాలూకా)

గత వేసవిసెలవులలో శ్రీవడ్లమూడి వెంకటరత్నంగారు (తె. తా. గ్రం. సంఘాధ్యక్షులు) తమ స్వగ్రామమగు మోపర్రునందు 26-4-40 వ తేదీ మొదలు 50 దినములు వయోజన విద్యాలయము నొకదానిని నిర్వహించిరి. చిన్నతనములో 2, 3 తరగతులు చదివి మానివేసిన యువకులు 25 మంది ఈ పాఠశాలయందు చదువుకొనిరి.

ప్రతినిత్యము సాయంత్రము 4 గంటలనుండి 6 గంటలవరకు పత్రికాపఠనమును, రాత్రి 8 గంటలనుండి 10 గంటల వరకు పాఠములును జరుగుచుండెను. గ్లోబు, దేశపటములు మున్నగు సాధనములతో వార్తా పత్రికా పఠనమున కవసరమయినంతవరకు చరిత్ర, భూగోళవిషయములు యువకులకు నేర్పబడెను. పెద్దలనిమిత్తము రాత్రులందు సంజయరాయబారముతో ప్రారంభించి భారత పురాణపఠనము కూడ ఏర్పాటు చేయబడెను. మరియు మ్యాజిక్ లాంతరు, మరికొన్ని పటముల సాయముతో గ్రామములో నాలుగైదు కేంద్రములలో అప్పుడప్పుడు ఉపన్యాసములు కూడ ఏర్పాటుచేయబడెను. ఈ ఉపన్యాసములకు స్త్రీలు, పురుషులు, పిల్లలు అమితముగ చేరు చుండిరి.

విద్యార్థులు 2 తరగతులుగ చేయబడిరి. వీరికి చదువు చెప్పుటలో శ్రీ కొడాలి వేంకటేశ్వర్లు (యస్. యస్. యల్. సీ. విద్యార్థి) గారును, స్థానికబోర్డు పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన శ్రీ కోసరాజు కృష్ణయ్యగారును సాయపడిరి. విద్యార్థుల కోరికపై చదువు, వ్రాతలతోపాటు లెక్కలు కూడ నేర్పబడెను. పాఠశాల ముగియునాటికి లెక్కలునేర్చుకొన్న పెద్ద తరగతివారు చదువు వ్రాతలతోపాటు సామాన్యములగు వడ్డీలెక్కలు, పొలముకొలతలు, ధాన్యము అమ్మకమునకు సంబంధించిన లెక్కలు కొంతవరకు నేర్వగలిగిరి. చిన్నతరగతివారు సామాన్యముగ చదువను వ్రాయను

నేర్చుకొనిరి. ఆఖరుదినమున గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులగు శ్రీకల్లూరి చంద్రమౌళిగారి అధ్యక్షతను ఒకసభజరుపబడెను. గ్రామస్థులందరీసభలో పాల్గొనిరి. పాఠశాలాభివృద్ధికివారు సంతసించిరి. అప్పటి నుండి పత్రిక చదువబడిన ప్రాంతమువారు ఒకదినపత్రికను తెప్పించుకొని చదువుచున్నారు.

## వయోజన విద్యాప్రచార విద్యాలయము, బాపట్ల

31-4-40 వ తేదీ బాపట్లలోని వయోజన విద్యా ప్రచారక సంఘమువారిచే వయోజన విద్యా ప్రచార విద్యాలయము ప్రారంభింపబడెను. ఈ సందర్భమున ఊరేగింపుటుత్సవము, బహిరంగసభ యేర్పాటుచేయబడెను. సభకు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ (ఉభయభాషా ప్రవీణ)గారధ్యక్షత వహించి వయోజనుల అక్షరాస్యతను గురించియు, వారిలో పత్రికా పఠనాభిలాషను ప్రోత్సహించ వలసిన అవసరమును గురించియు ఉపన్యసించిరి.

## విజయనగరంలో వయోజన విద్యాప్రబోధము

26-5-40 వ తేదీ సాయంత్రం విజయనగరంలోని స్వరాజ్య మైదానములో శ్రీ పసుమర్తి వీరభద్రస్వామి (యం. యల్. సి.)గారి అధ్యక్షతను వయోజన విద్యా ప్రబోధం నిమిత్తం సభజరిగినది. దీనిని శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారు ప్రారంభించుచు "నిరక్షరాస్యతను ఆంగ్లదేశములో పోగొట్టుటకు సర్వశక్తులు ఉపయోగించి విజయముపొందిరి. టర్కీలో ఈ సమస్య నెదుర్కొని కెమాలుపాషాగారు పాటుబడిరి. మనదేశములో కాంగ్రెసువారు మంత్రిపదవులు స్వీకరించిన పిదప బీహారు రాష్ట్రమునందు నిరక్షరాస్యతను పోగొట్టుటకు చాలచోట్ల శిబిరముల నేర్పరచి కృషిసల్పిరి. మదరాసు రాష్ట్రమునందు ఈ సమస్యనుగూర్చి సమాలోచనలు జరుగుచుండగా మంత్రులు రాజీనామా లిచ్చుట తటస్థించెను"అని చెప్పిరి.

## వయోజన విద్యాకేంద్రము, కర్నూలు

29-5-40 వ తేదీ కర్నూలు జిల్లాకలెక్టరు ఖాన్‌బహదూర్ ఎం. హుమాయూనుగారు ప్యాపలి గ్రామములో వయోజన విద్యాకేంద్రమును ప్రారంభించిరి. ఈ సందర్భమునవారు వయోజన విద్య యొక్క ప్రాముఖ్యతను గూర్చి ముచ్చటించిరి.

# గ్రంథసమీక్షలు (Book Reviews)

**దేశీయ పరిశ్రమలు** కర్త— శ్రీ పెండెం వెంకట్రాములు. పారిశ్రామిక గ్రంథమాలా, ద్వితీయ కుసుమము. క్రౌనుసైజు పుటలు 200, వెల రు 1—4—0

భారతదేశము పూర్వము అన్నివిధముల నున్నతిశిఖరము నందినది అనుట నిస్సంశయమే యగును. అయినను ఏయే విషయముల నెట్టు లెట్టు లున్నతి నందినదో సప్రమాణముగ నిరూపింపవలసినవారు పండితులగు విమర్శకులు. అట్టి ప్రయత్నఫలితమే యీ గ్రంథము. పారిశ్రామిక విషయమున భారతదేశ మెట్లభివృద్ధినందినదో యిందు సప్రమాణముగ నిరూపింపబడినది. సంస్కృతాంధ్రవాఙ్మయముల నుండియు, విదేశ విమర్శకుల వ్రాతలనుండియు సామగ్రిని దీసికొని మన దేశమున నేయే పరిశ్రమ లుండెడివో వివరింపబడ్డవి. సామాన్యముగ వస్త్ర పరిశ్రమ, నౌకాపరిశ్రమ మున్నగు ఏ కొలది పరిశ్రమల విషయమో తెలియును. గాని ఇందు కొన్ని పదులసంఖ్యలో ఉదాహరణపూర్వకముగా సంగ్రహింపగల్గుట గ్రంథకర్త పరిశ్రమను, పరిశీలనను, అభినివేశమును ప్రకటించును.

భారతాది ఇతిహాసములు, పురాణములలో కవి వర్ణనలను తొలగించి, కథలను త్రవ్వి, అందు నిగూఢముగనున్న శిల్పకళారహస్యములను తెచ్చి మనకు ప్రదర్శించుట ప్రశంసార్హము. ఇప్పుడు మనదేశమున ఎచ్చటెచ్చట ఏయేపరిశ్రమలున్నవో, ఏయే వస్తువులతో ఏయేరంగులు చేయనగునో యిందు వివరింపబడినవి.

అయినను ఇందు ఒకటి రెండు విషయములు సంశయమునకు తావిచ్చుచున్నవి.

"ఉదంకుడు పాతాళము (ఉత్తర అమెరికా) నుండి ఆర్యావర్తమున కొక్కనాటి ప్రయాణముజేసిన అశ్వం బగ్నితో జేయబడియుండెను. ఈహయము పర్జన్యుడను రాజువద్ద యుండుటచేత ఆరాజు కాలమునందు అగ్నితోగూడిన యంత్రపరిశ్రమ యున్నటుల తేటపడుచున్నది. నన్నయవంటి మహాకవి "అత్తురంగమగ్ని" ఆ తురంగ మగ్నితో జేయబడినదని రచించుటను బట్టికూడ సందియము తీఱుచున్నది. (దేశీయపరిశ్రమలు, ౬౦ పుట)

ఇది భారతమున ఆదిపర్వము నందలికథ. ఉదంకుడనువాడు గురుహితకార్యార్థియై పౌష్యుడను రాజు దేవేరియొద్దకు జని, ఆమె యిచ్చిన కుండలములు తీసికొనివచ్చుచుండగా తక్షకుడా కుండలములు హరించెను. ఉదంకుడు వానివెంటనే పాతాళమునకేగి...అందు తెలుపు నలుపు దారములతో వస్త్రము నేయుచున్న ఇద్దఱుస్త్రీలను, ద్వాదశార చక్రమును ద్రిప్పుచున్న ఆర్వురుకుమారులను, అతిప్రమాణతురంగంబు నెక్కిన ఒక్కదివ్యపురుషుని చూచి అతనిని ప్రస్తుతించెను. ఆపురుషుడనుగ్రహించి తన గుఱ్ఱపుచెవిలో గట్టిగ కేక వేయుమనగా ఉదంకుడట్లుచేసెను. అపుడా గుఱ్ఱపు అవయవములనుండి అగ్నిజ్వాలలు బయలువెడలగా నాగులు గడగడలాడిరి. తక్షకుడు కుండలములు తెచ్చియిచ్చెను. ఉదంకుడా కుండలములు తీసికొని, అవి ఆనాడె గురుపత్నికీయవలసియుండుటచే చింతించుచుండెను. అపుడా దివ్యపురుషుడా గుఱ్ఱమునుజూపి "ఈహయంబునెక్కి యేగుమ యిది

వడిగలదు మనసుకంటె గాడ్పుకంటె" అని యానతిచ్చెను. అతడట్లే వెళ్లి యీ జరిగినవిషయము నంతటిని గురువుతో చెప్పి యిది యేమి యని యడుగగా గురువు ఆరహస్యమును జెప్పిన ఘట్టమిది.

సీ॥ అప్పురుషుండింద్రుడయ్యె—తన్మైరావతంబు గోమయ మమృతంబునాగ..................

సీ॥ గీ॥ అత్తురంగమగ్ని యప్పురుషుండు పర్జన్యు, డింద్రసఖుడు సన్మునీంద్ర। (ఆది 1—118).

అని వివరించి శిష్యునికి తెలిపినాడు. ఇచట అగ్నిదేవుడే గుఱ్ఱపురూపమున వచ్చినాడనుట సరసముగాని, 'అగ్నితో చేయబడిన గుఱ్ఱము' అని అన్వయించి అగ్నితో గుఱ్ఱములను చేయుచుండువారని సాధింపబూనుట భారతదేశ పారిశ్రామికౌన్నత్యమును సాధించు నుద్రేకమును తెలుపును.

"భారతయుద్ధములో నీరసించిన వాయురథములనుగూడ భోజరాజు పునరుద్ధరించియుండెను. అందు మూడు విమానములను పూర్తిచేయించి వెలువరించెను." (దేశీయపరిశ్రమలు 32 పుట)

క్రీ. శ. 11 వ శతాబ్దిలో భారతదేశమున ఆకాశవిమానములున్నవని సాధించుటకు చూపిన బలము తక్కువ. ఈవిషయమున యథార్థము తేల్చుటకు విమర్శకులకిది చక్కని రంగము.

ఈ సెఱసులకేమిగాని పుస్తకము ఎల్లరు చదువదగినది. గ్రంథకర్త యిట్టి గ్రంథములను ఇంకను రచించి భారతౌన్నత్యమును ప్రకటింతురుగాక.

వ॥ వెంకటరత్నము

**'భట్టుమూర్తి రామరాజభూషణుడా?'** కర్త:— శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు
క్రౌను 94 పుటలు : వెల రు 0—8—0

భట్టుమూర్తి, రామరాజభూషణ నామము లొక్కనివా ? ఇద్దఱివా ? అనిచర్చించిన విమర్శన గ్రంథమిది. నన్నూ ఱేండ్లనాటి కవులను పైకి లాగికొనివచ్చి పేరును గూర్చి చర్చించుచు పూర్వపక్ష సిద్ధాంతములుచేయుట మన ప్రస్తుతస్థితిగతులలో ఆశ్చర్యకరముగా నుండవచ్చును. కాని విమర్శకులకీ కాలభేదములేదు. వారి కీయనంతమగు కాలము అఖండస్వరూపము. చరిత్రకారులకు భూతకాలమే ప్రధానరంగము. వాఙ్మయానురక్తుల కిది పొలిమేరలోనిదే.

ఈనామధేయవిషయ మీమాంసకు రంగమున కెక్కినదే. గురుజాడ రామమూర్తి, వీరేశలింగంపంతులు, పూండ్ల రామకృష్ణయ్య మున్నగు పండితులు చర్చలుచేసి తమతమ యభిప్రాయములను ప్రకటించియున్నారు.

తరువాత శ్రీవఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు తమ 'వసుచరిత్ర విమర్శము'లో ఈ విషయమును సమగ్రముముగా చర్చించి యీరెండు పేరులు నొక్కనివేయని నిర్ధారణచేసియున్నారు. దానిని ఖండించుచు వ్రాసిన విమర్శనమిది.

ఐక్య వాదమునకు శ్రీ శాస్త్రిగారాధారముగా గైకొన్న జనశ్రుతులును, చాటువులును, వాని యసంబద్ధములను చక్కగా జూపుచు ఇంటు ఎగురగొట్టబడినవి. కవితారీతి, హనూమత్ప్రసాదము, సంగీత పరిచయము మొదలగు కారణములను ఇంకను లోతుగ విచారించి వారిభేదములను, బాగుగ నిరూపింపబడినది.

శాస్త్రిగారి సిద్ధాంతము చదివినప్పుడు ఇరువురు నొక్కరేయను భావము గట్టిగ గలుగును. ఈ విమర్శము జదివినయెడల నిరువురు వేరు అను భావము తప్పక కలుగును. ప్రశంసనీయమగు హేతువాదముతో విమర్శన మింత చక్కగ నిర్వహించుట మెచ్చదగినది.

8

మఱియు నిందు 'నరసభూపాలీయ' రచనా కాలముగూడ చర్చింపబడినది.

'నరసభూపాలీయము' రచించుచున్నాటికి విజయనగరరాజ్య విప్లవము జరుగలేదనియు, తల్లికోట యుద్ధము జరుగలేదనియు, రామరాయలింకను జీవించియే యున్నాడనియు తెలిపిన శ్రీ శాస్త్రి గారి యభిప్రాయమిందు ఖండింపబడి తల్లికోట యుద్ధానంతరమే తిరుమలదేవరాయలు రాజయిన వెనుక రచింపబడ్డదని సకారణముగా నిరూపింపబడినది. పరిశోధకులకు, చారిత్రికులకు, ఇది మనోహర విహారభూమి.

భాష సరలము. కారణములు యుక్తియుక్తములు. ఇంకను సందిగ్ధములుగానున్న చరిత్రాంశములపై ఈగ్రంథకర్త తమ విమర్శప్రకాశమును ప్రసరింప చేయుదురుగాక!

వ. వెం. ర.

**సుభాషిత రత్నాకరము** కర్త:— ఉభయభాషాప్రవీణ పింజల సుబ్రహ్మణ్యకవిగారు
క్రౌను 200 పుటలు. వెల రు 1—0—0

ఉపన్యాస, సంభాషణ సందర్భములలో తమ యభిప్రాయములకు బలముగా పెద్దల యభిప్రాయములను సూచించుట సమంజసము. ఆయభిప్రాయములు వచనరూపముగ నుండుటకంటె పద్యములు, లోకోక్తులు మొదలగు రూపమున నుండుట మెచ్చదగినది. సంస్కృతమున ఇట్టి ప్రాస్తావిక శ్లోకములు—వెక్కు విషయములకు సంబంధించినవి—ప్రత్యేక పుస్తకములుగ కూర్పబడి ప్రచారమున నున్నవి. తెనుగున సామెతలు మాత్రమున్నవిగాని వివిధభావ బంధురములగు ప్రాస్తావిక పద్యములు ఒక్కతావున కూర్పబడియుండలేదు. అట్టిలోపము ఈగ్రంథమువలన చాలవఱకు తీఱగలదు.

సంస్కృత కవీశ్వరుల భావములు సరలము, మధురము, లలితమునగు భాషలో గీతములుగా రచించి యిందు కూర్పబడినవి.

ఇందలి ప్రతి పద్యమునను ఒక సిద్ధాంతమును ఉదాహరణమును చేర్పబడియున్నది. కొన్నింటిలో లోకోక్తులు దృష్టాంతములుగా గైకొని సమర్థింపబడినవి.

ఇందు సుభాషిత ప్రశంస, కవిత్వము, సుకవి, కుకవి, సరసుడు, విరసుడు, పండితుడు, మూఢుడు మొదలగు నూఱు విషయములు ప్రశంసా నిందాపూర్వకముగా వర్ణింపబడియున్నవి.

ఈగ్రంథము పండితులు, పామరులు చదువుట కనుకూలముగ చక్కని శైలిలో, సుగమాన్వయముతో విరాజిల్లుచున్నది.

మచ్చునకు ఒక్క పద్యము

గీ. పండితుడు మెచ్చరని కోపపడు జడుండు
తనదు కావ్యంపు దోషముల్ తలపబోడు
రవికకుట్టిన వాని నేరమ్ము నెంచు
నతివ తన కుమ్మ కుచముల నరయునొక్కొ॥

వ. వెం. ర.

**Theory of Library Catalogue** *by S. R. Ranganathan, M.A., L.T., Published by the Madras Library Association, Triplicane, Madras 1940*

The author has evolved a theory and elevated cataloguing to the level of a science instead of leaving it merely a technique. The occasion for writing the book is, as stated in the introduction, the existence of conflicting and contradictory principles in regard to author entries, periodical publications and corporate authors, as enunciated by the British and American Library Associations and recent writers on cataloguing. The scope of the subject is confined to Dictionary and Classified Catalogues. All the views of recent writers on cataloguing, like Margaret Mann, Sharp, Quinn and Cutter and the rules of A. A. Code are critically examined at great length and the author sets out some fundamental laws for cataloguing. The respective merits of the Dictionary and Classified Catalogues are discussed in a scholarly and impressive manner and the superiority of the latter is emphasized.

The book consists of seven parts of which part '0' deals with preliminaries, definitions and examples of several kinds of catalogue. All the entries relating to Dictionary and Classified Catalogue are given with profuse examples with matchless clarity and precision, and seven guiding principles are enunciated. These are the Law of Parsimony, Canon of Consistency, Relevance, Ascertainability, Permanence, Currency and the Canon of Prepotence which is special to cataloguing.

Part I deals with the discussion of the rules 162 to 166 of Cutter (rules for Dictionary Catalogue) and their further treatment by Margaret Mann. The discussion is learned and interesting. The inconsistency and self-contradictory position of Cutter is traced by the author to Cutter's failure to profit by the Scheme of Classification in determining specific subject entries. This statement is a little surprising in view of the fact that Cutter himself was the author of Expansive System of Classification. The inter-relatedness of classification and cataloguing was long ago emphasized by Brown (Vide Berwick Sayer's Manual of Classification page 315). The explanation offered by Ranganathan for Cutter's failure is not convincing. As a Pioneer in the work of cataloguing Cutter deserves to be treated with much sympathy and reverence. Ranganathan

has shown that the difficulties presented by adherence to Cutter's Rules can be obviated by following the Colon Classification.

After dealing with various kinds of Reference entries in the last chapter of this first part, the Syndetic versus systematic arrangement is discussed. In this discussion the Dictionary Catalogue is completely overthrown but with the consolation that the Modern Classified Catalogue with Alphabetical Index is its own image and with some modifications the Dictionary Catalogue could be equated to the Classified Catalogue.

Part II deals with Series entries. Part III deals with Analytical entries. At page 223 second para rule 914 of Cutter is mentioned. This is obviously a misprint for rule 194 of Cutter. The author pays special attention to subject analytics so far as books are concerned. Part IV deals with Periodical publications. The main entry for periodicals is discussed and profuse examples for card technique are given. While the writer is for profuse added entries for books, to analytical entries for articles in the periodical literature he pays no attention and dismisses them as being a problem for International effort.

Part V deals with Personal Names, Corporate Names and about the author of a book. This part is very well written with many good examples.

Part VI which is a concluding portion deals with the physical form, co-operative cataloguing, annotations, alphabetization and Gestalt value and has a summary towards the end.

The intention of the writer seems to be to rationalize his Classified Catalogue Code and incidentally to prove the superiority of the Colon Scheme of Classification. Librarians may differ regarding the Colon Scheme of Classification but there is no reason why the Theory of Cataloguing should not be followed by all as it expounds all the fundamental principles in an original, learned and scientific manner. The Madras Library Association deserves to be congratulated on the publication of the book which is a mine of information to students of Library Science and professional Librarians.

*K. Nagaraja Rao*

## Memoirs of the Madras Library Association:

*Published by the Madras Library Association*
*Triplicane, Madras–1940*

The volume under review is perhaps the first of its kind in India. The achievements of the Madras Library Association towards the fulfilment of the objects it had in view are really creditable and one felt that a Memoirs was long overdue. It is no easy task to break the crust of popular apathy towards Library movement if we remember that there are still people in this country who seem to wonder whether there could be any such science as Library Science and who sincerely believe that talk of Library movement, cataloguing, classification etc. are merely a cover to hide the sinecure nature of librarian's post. If the Madras city and other parts of the presidency where the association has been directing its activities is now library minded it is no small achievement of the Association.

Excepting for the introductory essay detailing the activities of the Association since its inception, by the President of the Association, all the other articles in the volume are by the members of the staff of the Madras University Library. It is hoped that this is a mere coincidence and that the scheme of the *Memoirs* permits of contributions by others also.

The doyen of the Library profession in India has contributed 4 essays: Culture through books; Woes of Tamil periodicals (with Mr. K. M. Sivaraman); Nascent thought from Madras and Spirtiual experience and Mysticism. Excepting the first and the last the others are more or less of a local character and are important for the method of dealing with the subjects chosen. The essay "Culture through books" is non-technical and thought provoking and is a brilliant epitome of the history of civilization. In it, is implied a philosophy. One feels that the last phase the "Peace phase" has not been sufficiently dealt with whereas the two other phases, the Offensive and the Defensive, have been done full justice to. The article deserves to be read and reread.

As is always with the method of the author, abstruse technical points are dealt with in such a way as it will be intelligible even to laymen in so far as the nature of the subject will allow. This the author effects by homely illustrations and correlating his subject with the other departments of thought

and ultimately with a view of life. The essay on "Spiritual experience and Mysticism" is illustrative on the point. This, *prima facie*, appears to be a discussion on a technical point important for the classifier, on the need for a new main class under the head "Spiritual experience and mysticism" in the Colon classification which the author finds an absolute necessity. In the discussion about this, one finds the subject being elevated to a higher plane and a philosophy of life developed.

In an interesting and lively article "Reference service in Indology" Mr. Sundaram draws pointed attention to and rightly bewails the lack of bibliographical tools to aid research in Indology. A very useful and fairly exhaustive list of societies, periodicals or series which deal with Indological literature is given in the article. To this list may be added *The sacred books of the Buddhists, the Oriental Translation Fund. Frubners Oriental Series, Hakluyt Society, and Epigraphia Indica.*

Sri K. M. Sivaraman compares with great clarity the relative merits of the various cataloguing codes in existence in a scholarly article entitled "Standards in cataloguing". "Flow of Literature" and "What Madras Reads" by Sri S. Ramabhadran and A. Rajabhupati respectively are of non-technical interest showing how library statistics can be made use of to glean interesting and valuable information on Social trends.

It is hoped that the issue of Memoirs will be a regular feature of the activities of the Association.

*S. P.*

---

# EXCHANGES

## ‘ఆంధ్రగ్రంథాలయం’ ఆఫీసుకుచేరిన ప్రచురణల వివరములు

The Editor, Andhra Granthalayam acknowledges with thanks the receipt of the following exchanges for Andhra Granthalayam.

1. *South African Libraries*: Published by the South African Library Association and edited from P. O. Box 1176, Johannesburg with Mr. P. Freer, B. A., F. L. A as Honorary Editor and Elizabeth Hartmann B. A., F. L. A as Honorary Assistant Editor.

   It is sent free to Full Members, whose annual subscri ptions (10/6) have been paid to the secretary, P. O. Box 397, Pretoria on or before July 1st. The price to Non-Members is 10/6 per annum and 3/- post free per single copy, obtanable from The Honorary Assistant Editor, University of the Witwaterstand, Milner Park, Johannesberg.

   The journal is mainly devoted to the discussion of library problems and bibliography especially Africana. Conbributions, Correspondence and discussion are invited on all subjects in Africans and or in English within the seope of S. A. L.

2. *The Modern Librarian*: A quarterly journal of Library Science published from Lahore by The Punjab Library Association with Sant Ram Bhatia as Editor. Annual Subscription Rs. 5/- in India; Foreign 10sh, or $ 2-50.

   All correspondence including subscriptions should be addressed to the Editor, Forman Christian College Library, Lahore.

3. *Memoirs of the Madras Library Association. 1940.* Price Re. 1-8-0. It is published by The Madras Library Association and copies can be had of The Secretary, Madras Library Association, Triplicane, Madras.

4. *Bengal Library Association Bulletin*: Published by the Bengal Library Association, Central Library, The University, Calcutta with Dr. Niharranjan Ray as Editor. Free to members. Single Copy Rupee one.

5. **ప్రతిభ:** నవ్యసాహిత్య పరిషత్పత్రిక. త్రైమాసికము. సంవత్సర చందా రు 2—0—0
   సంపాదకులు : శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం, గుంటూరు

6. **విజ్ఞానం:** సంపాదకుడు: శ్రీకాళీపట్నపు కొండయ్య, ఎమ్. ఎస్. సి.,
   సంవత్సరానికి ఆరుసంచికలు - చందా నాలుగు రూపాయలు
   కార్యస్థానం : నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా

7. **గృహలక్ష్మి:** స్త్రీల సచిత్రమాసపత్రిక, సంపాదకుడు: డాక్టరు కే. యన్. కేసరి
   సంవత్సర చందా మూడురూపాయలు, కార్యాలయము: రాయపేట, మదరాసు.

# REMOVAL OF ILLITERACY*

**Sri G. Harisarvottama Rao, M. A.,**

*President, Andhra Desa Library Association and*
*Vice-chairman, South Indian Adult Education Association*

The Government of Madras is not at present in a position to spend huge sums of money on this new enterprise, the removal of Illiteracy. Whatever methods may be suggested, therefore, we must bear in mind this factor.

To me it appears there are only two agencies that may do this work on a mass scale. The one is the School Master,— both urban and village; the other is the student of the S. S. L. C. standard and above. All other agencies can only be spasmodic in their efforts and no continued or wholesale effects may be expected of them though as propogandistic channels for the new idea they may be useful.

Even the two agencies I have named cannot really function until they are effectively organised in a proper manner The school master is being shyed at because at one stage "our night schools" became bogus organisations. It must be remembered, however, that the time-spirit is different today. If only the Congress organisations are active, the very nightschool which was once a snare may today be our saviour. Let us not make our nightschools money-making centres for the school masters or the managers. Let us train all our school masters to do this piece of work as national service. All the return that they expect should be no more than a mention of merit in the service-books. Arrangements have to be made forthwith to give the necessary equipment and psychological background to our army of Village school masters. That can be done only by the managements which, for the most part, are today our District Boards. Every District Board should be required to give at least a ten days training, in a camp, to every one of its school masters and mistresses, in Adult Education methods - primarily methods to remove illiteracy from our midst. This has not to be done in the old routine departmental way. The District Board should fully use the local non-official agencies, more prominently the Congress Committees; for, after all the Adult in the mass has to be

* A memorandum submitted to The Hon. Sri C. J. Varkey, Minister for Education to the Government of Madras on The best available means to remove illiteracy in the Province of Madras.

induced to look upon our work with favour. An itenerant school may be organised which shall be held for specified periods, in convenient centres in the District Board area. Batches of, say, 30 teachers every ten days may be sent up to the school for training. In that case leave arrangements may easily be made and no travelling allowance need be incurred. All that may be necessary is the expenditure on the school and feeding of thirty men a day. One competent teacher will do and he may be required to work with five days allowed between every two ten days. His expenditure may roughly be put at Rs. 100/- a month including travelling. Feeding of thirty men for twenty-five days in the month, should not cost more than Rs. 280/-. Estimating other incidentals at Rs. 20/- a month, the total cost comes to Rs. 400/- a month or roughly Rs. 5000/- a year. 720 school masters get trained and equipped in the year and as every batch of 30 moves into its places effective work can easily begin provided there is sufficient local spirit. One year's experiment in this manner, will, I feel, be enough to test its value. Even if a few well-to-do District Boards take up this work, it will be useful as a start. The District Boards may invite other managers to send their teachers as well for this training at not more than 10 at a camp provided the managements pay at annas six a day for the feeding charges. That will add to the usefulness of the scheme.

In regard to the teaching of teachers of these school masters i. e., those who have to be in charge of camps not much is needed. Any retired Headmaster of a High School or a Professor of the College or an L. T. with ideas and enthusiasm will be able to pick up the necessary initiative by observation for a month at any centre carrying on the work. For the initial workers, our South Indian Adult Education Association will hold itself responsible for supply.

As my idea is that literacy can be imparted to an average adult in six weeks time, I expect school masters can do immense work at least in centres where there are Higher Elementary schools; for, they may arrange turns of six weeks each and work. They can well keep up the literacy gained also by a carefully organised but small library service.

Now let me turn to the students. Their work can only be possible during the holidays, especially during the longer holidays, and it cannot go beyond the local area; for, as at present situated, we may not envisage provision for feeding them or

carrying them from place to place. All that may be done for them is that in places where there are large congregations of them, as in Madras, we may hold classes in convenient centres and put them in the way as to how they may proceed. These classes may be held once a week, say, on Sundays. No student may have efficient capacity for work without this training. During the holidays, when he goes home, he may be asked to co-operate with local effort and do his bit in an organised endeavour. To that end, it may be necessary for our central organisation to be active making lists of trained students with holiday addresses and arranging work for them in the local areas to which they go. Their occasional inflow into the rural areas will certainly be useful to give a tone to the local work. Even while at College or school, these young men may be asked to carry on *Removal of Illiteracy campaigns* round about them under the control and supervision of their own teachers. But there is one difficulty here. Students can at best give Saturdays and Sundays. At two days in the week, no effective work may be possible. No adult may be made to wait for five days between two lessons and no result may be expected if one adult has to be handled for removal of illiteracy by different teachers on different days. The role therefore, that should be assigned to the week-end work of students should be more of the nature of propoganda and keeping up literacy, after it has been acquired through library service and paper reading congregations.

For good work turned out by these students, they should receive certificates from competent authorities - the University, the Colleges or Adult Education Associations and authorities. These certificates, and entries in the Service Registers of School masters should be considered additional qualifications in deciding priority for preferment. The Government and other bodies employing men may do well to accord approval to this suggestion; for, I believe that this has a greater value for effective work than a small lumpsum monetary reward which may have its own temptations.

---

# College Libraries

by

*Punyamurti, B. A., B. Ed., Dip. Lib.*

The present state of most* of the College libraries in India is highly deplorable. There are no doubt a few well organised libraries in the country but the majority of them are far from being what libraries ought to be. They cannot be called libraries; they are mere store houses; nor do they deserve even that designation as they do not possess even enough store.

### No classification and no cataloguing

Even granting that there is store, it is there as a confused mass; no proper classification is attempted and no cataloguing worth the name. If there is a catalogue, it is an inflexible printed book catalogue, giving meagre information and being always out of date.

### No open access

To add to the confused state of the store, readers have no free access to the shelves. A reader has to apply for a book long before he wants it and wait for his chance. If the book is not to his liking, the reader has to wait till the next fixed hour of issue. The unanalysed store is subject to further injustice of being located in a place seldom frequented and some out of the way dark ill ventilated room. Even that stingy room is more frequently closed than kept open. There are cases of libraries that have not lent books some times for weeks together. There are generally particular hours of a day or two per week alloted for issue and no more.

### The colossal ignorance of the authorities concerned

The worst features obtaining at present are due to the colossal ignorance of the so called educated authorities and the staff they employ to minister to the needs of the readers. Many phases of the service rendered by the modern library service are not generally understood by the administrative officers and faculties. They are still obsessed with the false theory that any educated person is certain to satisfactorily fill a librarian's post in a college.

"Most of our colleges and universities have no doubt begun to include in their annual staff return a post under the dignified title of librarian. But the salary shown against the entry implies deplorable lack of appreciation of the need for a real librarian. In most of our degree colleges the so called librarian is usually a clerk and nothing more by training, temparament and status. He is not given any initiative nor is he capable of any. His time is largely

spent in maintaining the files and carrying them now and then to the room occupied by the dignitary the professor in charge of the library to whom he is responsible and by dancing attendance on whom, he hopes to keep his place. His assistant is usually an attendant whose educational attainments are a little too good for a peon's post. There is none on the library staff who could link it up with the instructional force of the college, not to speak of following up the course of studies pursued by the College; none who look up material in advance in anticipation of future demand; none who could instruct the ordinary students in the use of the books of the library, not to speak of assisting the research students"

## The need for reorganisation

A college that is adequately discharging its responsibilities can never neglect its library which is the very heart of it. The present methods of instruction place relatively less dependance on the lecture and the text book and much more on the library. Emphasis is laid on work done and the assimilation of ideas gathered from many sources rather than upon memorizing the treatise of one author. This has greatly increased the responsibilities of the library.

## Reorganisation

To meet the present needs of the library clientele in a college library, the first step towards the path of progress is the change of head and heart on the part of the authorities concerned. Next should follow the required funds to reorganise the whole library and the appointment of sympathetic committee. The third is to have the clerk-librarian as clerk only and no longer a librarian. The library should be staffed with graduates specially trained for the purpose. They should be amply paid and have either the rank of a professor or of at least an assistant professor. Good organisation, proper classification and useful cataloguing naturally follow qualified staff. Adequate funds being provided, a nice well ventilated suitably situated building has to be erected, providing comfortable seating arrangement for general readers and special rooms for research workers.

## The result

Needless to say that, with qualified staff and adequate funds the required uptodate books and book rarities and the various types of modern library service would result and benefit the colleges.

# Open Access in the Libraries

*by*

P. KONDA REDDY, *Dip. Lib.*

*Andhra University Library, Waltair*

A systematic scheme of classification and cataloguing of books, a well arranged stack room with a separate periodical room, and a proper counter with the system of open access are most essential and important in the organisation of modern libraries. In the earlier years the books in the libraries were neither classified nor catalogued. They were merely numbered in an alphabetical or numerical order irrespective of the subjects they dealt with and were arranged according to their size and kept in almirahs and boxes under lock and key. Now almost all the libraries have the system of open access in the Western countries. A library with closed access is a strange thing in these countries. But in India it is a common thing to find many libraries following the antiquated system of closed access.

The aim of the modern library is to enable the readers to get the required information without any loss of time and also to stimulate and direct their knowledge and love of books. To fulfil these aims the introduction of the open access system is quite essential. In a library having open access the readers are given free and unrestricted access to all the books on the shelves and are invited to enjoy the rich and accumulated treasures of a library. In the libraries of the West the Edinburgh library, was the first to introduce this in 1725. Later in 1894 Clerkenwell public library in England, adopted this system. Gradually it made quite a triumphal progress throughout England and America and is now thoroughly established in every library of importance. Although this practice is thus universal in the Western countries, it is a new and rare phenomenon in our country as it has been recently introduced.

In this connection, mention must be made of closed shelf before open access is discussed. In a closed shelf system all the books are safely locked up in almirahs with glass doors or kept on the shelves covered with wire netting, so that the readers are deprived of the privilege of free access to examine and select books they desire. In this case, the readers can only have an external view which can hardly give them any satisfaction. Books

must not be kept in locked cases; but must be allowed to come out to meet human eye and human touch. The aim of the library must not be the mere collection of books but their proper distribution among the readers. In a library with closed access many good books will be lying on shelves for ages, as no reader will be able to look at them except perhaps the peon who occasionally dusts them. To keep the readers away from the books is not the best way of increasing the usefulness of a library. The disadvantages felt by the reader in a closed library are many. First of all, he has to waste a good deal of his precious time before the catalogue in hunting for the required title in such a labyrinth of entries. Then he has to write on a slip for the required book and wait till the book is searched for and brought to the counter for issue by the library clerk. Moreover, the number of attendants to serve the readers in this system will have to be large.

After experiencing the benefits of the open access no librarian will entertain the idea of returning to old methods of the closed shelf. But some librarians, we understand, revert to the old system when there is a considerable loss of books. The loss of books is inevitable either in the closed shelf or the open access library. But this should not be the ground for depriving the readers of their privilege of free access to the shelves; just as in parks where abuse of free access to flowers has not been deemed a sufficient reason for exclusion of the public.

The librarians have to adopt the following measures carefully in the application and organization of the open access system. The library building must be a safe and compact one with all doors and windows covered with strong wire netting, providing a single exit and entrance, making it impossible for unscrupulous persons to practise their hobby of book thieving. As free access to the shelves demands more space, the arrangement of the shelves in the stack room must not cause any sort of inconvenience to the readers. To protect the library property from the book thieves, who may carry small books surreptitiously tucking them up under their coats, there must be vigilant supervision at the counter. There must be always a careful watchman at the entrance exclusively to watch the readers going in and coming out. He must not be entrusted with any other work which might distract his attention. The library should provide an efficient system of guides in the stack room, so that the readers may not waste their precious time in searching for the required books on the shelves. The books left on the reading tables by the readers must be shelved as early as possible by the

attendant in charge, and the reading tables must be kept clean to make the library pleasant and attractive and to convey the impression of welcome and comfort.

The advantages of this system are varied. As compared with the closed shelf, the open shelf plan is undoubtedly more economical. This system does not require too many clerks, attendants and peons to help the readers and borrowers. The readers themselves go straight to the shelves and pick up the required books and bring them to the counter for issue. Thus in an open library the time spent for getting books is saved. Moreover, many readers can be more promptly and more satisfactorily served at a time.

This system has a better educational value as it offers the readers the privilege of visiting the shelves and selecting the books of their own accord. Instead of searching for the required book in the catalogue, the readers can directly face the books on the shelves and can browse among them pleasantly for a few minutes and pick out the particular books they require for their study. "How shall the book and the reader come together most easily and effectively? The reader is deemed as important as the book. Would anything serve the reader better than the handling of books himself? He is allowed to search and find out for himself what is to him the pearl among the heap of pebbles. The very reading of the titles on the backs of the books is enlightening. The library is no longer a mere storehouse for books; it may become an active educational force, it may be indeed, what it has been called by one of our greatest writers "The peoples university". This helps them to produce a more scholarly attitude towards their work. "The books are here; come and help yourself; make friends with them" is the attitude of a good library. As there is no restriction, the readers are at liberty to enjoy a comprehensive use of the stacks whenever they like. As the reader is well acquainted with the books on the shelves by frequent visits to his particular sections, he could easily pick out the required book without wasting his time or without being obliged to call upon the library staff. Lastly this system brings a change in routine work of the librarian and makes it necessary for him to be a helpful assistant and friendly guide to all those who need direction, instead of being a mere custodian of books.

In spite of these advantages, some objections are raised against this system by some librarians. The main objection is the confusion resulting from misplacement on the shelves. Of course, the readers misplace books not only occasionally but

